# వి ష య సూ చి క

# విషయానుక్రమణిక



# శ్రీరామకృష్ణ ప్రభ

## తొమ్మిదవ సంపుటము

౧౯౫౨ జూలై, నందన - ఆషాఢము మొదలు ౧౯౫౩ జూను, విజయ - జ్యేష్ఠము వఱకు

సంపాదకులు :

శ్రీ ఋతజానందస్వామి

శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి

సంవత్సర చందా రూ. 3] [విడి ప్రతి అణాలు 6




# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౯ } ౧౯౫౩ — జూన్ : : విజయ — జ్యేష్ఠము { సంచిక ౧౨


## ప్రార్థన

శ్లో. సాక్షాద్ భవన్మయే నాథ సర్వస్మిన్ భువనాంతరే,
కిం న భక్తి మతాం క్షేత్రం మంత్రః క్వైషాం న సిద్ధ్యతి ॥

మాదృశైః నచ ర్వ్యేత భవద్భక్తి మహౌషధిః,
తాదృశీ భగవన్ యస్యా మోక్షాఖ్యోఽనంతరో రసః ॥

ఓ ప్రభూ! విశ్వమునందంతటను సంపూర్ణముగా నీవే నిండియున్నప్పుడు, నీ భక్తులకు నీ క్షేత్రము కానిదేది? నీ మంత్రము నెందుచ్చరించిన ఫలింపక యుండును? (సమస్త ప్రదేశములందును ఫలించునన్న భావము.)

కావున నాయట్టి ముముక్షువులు మోక్షప్రాపకమగు నీ మహౌషధిని (చర్వణము గావింపకుందురా?) నమలక యుందురా?

ఉత్పలదేవాచార్యుని శివస్తోత్రావళి, 1-4-22.

ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

# శ్రీ రామకృష్ణ వచనామృతము — 'మ.'

శ్లో. ఆహుస్త్వాం ఋషయ స్సర్వే దేవర్షి నారదస్తథా,
అసితో దేవలోవ్యాసః స్త్వయం చైవ బ్రవీషిమే.

సోమవారము,
24-12-1883.

సరవిచెట్ల తోటయందు శ్రీ గురుదేవుడు 'మ.' తో నొంటరిగా మాటలాడుచున్నాడు. ఇప్పటికి పదునొకండు దినములనుండియు 'మ.' శ్రీవారితోనే నివసించుచుండెను. అది శీత కాలము. అపుడపుడే తూర్పుదిక్కున సూర్యుడుదయించుచున్నాడు. తోటకు పడమట గంగానది ప్రవహించుచున్నది. నది యిపు డుత్తర వాహిని. పోటు ప్రారంభించినది. ఎందుజూచినను చెట్లును తీగలును విరాజిల్లుచున్నవి. శ్రీవారు సాధన గావించిన బిల్వ వృక్షము అనతిదూరమున గలదు. రామకృష్ణులవారు పూర్వాభిముఖులై సంభాషించుచున్నారు. 'మ.' ఉత్తరముఖాభిముఖుడై తల వంచుకొని శ్రీవారి వచనము లాలించుచున్నాడు. శీతకాలమున సూర్యోదయమును జూచి సమస్త జగత్తును హసించుచున్నట్లు భాసించుచుండెను. శ్రీ రామకృష్ణులవారు బ్రహ్మజ్ఞానమునుగూర్చి సంభాషించుచున్నారు.

శ్రీరామ:—సాకార నిరాకారములు రెండును సత్యములే. శ్రీ తోతాపురి సచ్చిదానంద బ్రహ్మ మెట్టిదో నాకు వివరించి చెప్పెడివారు. అది దశదిశలయందును సంపూర్ణముగా జలమయమగు అనంతసాగరమువంటిది. అది జగత్కారణమయిన సలిలము. కార్యము కలిగినపుడు తరంగములు లేచును. సృష్టి స్థితి ప్రలయములే యట్టి కార్యములు. మఱియు శ్రీవారిట్లు పలికెడివారు: జ్ఞానవిచారము ముగియు స్థితియే బ్రహ్మము. కర్పూరమును కాల్చిన చివర నేమియు మిగులనియట్టిది అది. బ్రహ్మ వాఙ్మనోతీతము. ఉప్పు బొమ్మ సముద్రపు లోతును దెలియుటకై వెళ్లినది కాని రాలేదు. అందే లీనమై పోయినది.

ఋషులు శ్రీరాముని జూచి, ఓ రామా! నిన్ను భరద్వాజాది ఋషులు అవతారపురుషునిగా గొనియాడవచ్చును. మేము (ఓంకార) శబ్దబ్రహ్మోపాసకులము. మాకు మానుష రూప మనవసరము. రాముడు చిరునవ్వు నవ్వి వారి పూజ లంగీకరించి వెడలిపోయెను.

నిత్యవస్తువునకే లీలయు సంక్రమించును. సౌధ సోపానముల సంబంధమువంటిది అది. నిత్యవస్తువు లీల లనేక విధములు. ఈశ్వరలీల, దేవలీల, నరలీల, జగల్లీల—మున్నగునవి. నరలీలయే అవతారము. మేడమీద కురిసిన వర్షము అందలి గొట్టము మూలముగా ధారగా

పడును. ఆ సచ్చిదానందమే స్వీయ శక్తి మార్గానుసారిణి, ఒక్కొక్క గొట్టము ద్వారా నీరు ప్రవహించుచున్నట్లు ప్రవహించుచుండును. రామావతార కాలమున భరద్వాజాదులగు ద్వాదశ ఋషులే ఆతనిని గుర్తింపగలిగిరి. అవతారము నెల్లరును గుర్తింపజాలరు. భగవంతుడు తన యవతార కాలమున మానవులకు జ్ఞానము భక్తి మున్నగువానిని బోధించును. సరియే కాని నీకు నేనెట్లు కనిపించుచున్నాను? మా తండ్రి గయకు వెళ్లిరి అచట ఆయనగారికి స్వప్నమున ఇష్టదైవము రఘువీరుడు సాక్షాత్కరించి నేను నీకు పుత్రుడనై ప్రభవింతునని వాగ్దానముచేసెను. అపుడు మా తండ్రి ఇట్లు విన్నవించుకొనెను: 'దేవా! నేను పరమదరిద్రుడనగు బ్రాహ్మణుడను. నీకు నేనెట్టి సేవ చేయగలను?' అందులకు 'అది జరుగునులే' యని రఘువీరుడు అభయప్రదానము చేసెను. అక్కయ్య (హృదయుని జనని) నా పాదముల బూజించెడిది. ఒకనాడు చందన పుష్పాదులతో పూజించునపుడు దేవి నా పాదముల తన శిరస్సున బెట్టుకొని 'నీవు కాశీయందు మరణింతు'వని చెప్పెను.

మథురబాబు నాతో నిట్లు చెప్పెను: 'బాబా! నీలో భగవంతుడు దప్ప నితరమేదియు లేదు. నీ శరీరము వట్టి ఒరవంటిది. చూపులకు గుమ్మడికాయవలె కనిపించినను లోపల విత్తనములుగాని గుంజుగాని లేవు; నిన్ను చూడగా నెవరో ముసుగువైచుకొని నడచుచున్నట్లు కనిపించుచున్నది.'

దేవి సమస్తమును నాకు ముందుగనే చూపుచున్నది. పంచవటియందు గౌరాంగ సంకీర్తన దళమును జూచితిని. అందు బలరామబోసును జూచితిని. నీవును కనిపించితివి. గౌరాంగుని భావ మరయుటకై పోయితిని. మా గ్రామము నందలి శ్యామ్‌బజారున నాకది కనిపించినది. పెద్ద జనసమూహము కూడినది. వారందరును చెట్లు చేమలు గోడలు—అంతట నెక్కి నిలుచుకొనిరి. రేయింబవళ్లు వారు నన్ను వీడక నా చుట్టు నుండిరి. బయలునకు బోవుటకుగూడ నవకాశము లభింపలేదు. అపుడు అమ్మా! చాలునులే యని ప్రార్థించితిని. ఇపుడు నాకు శాంతి లభించినది. నేను మఱల రావలసి యుండును. కావుననే నా యనుచరుల కెల్లరకు నాయంతజ్ఞానము చెప్పుచుండుటలేదు. (నవ్వుచు) మీకు అంతజ్ఞానమొసగినచో మీరు మఱల నన్ను సమీపింతురా? నీవు చైతన్యభాగవతము చదువుచుండగనే నేను నిన్ను గుర్తుపట్టితిని. నీవు నాకు ఆప్తుడవు. తండ్రి కొడుకులవంటిది మన సంబంధము. మీరందరు మరల నిటకు తిరిగి వచ్చుచున్నారు. చెట్టుమీద ప్రాకియున్న తీగను ఈడ్చినచో కొమ్మలన్నియు ఆ వైపునకు వచ్చును. ఇచ్చటి ఆకర్షణశక్తివలననే ఎల్లరును వచ్చుచున్నారు. ఒకరికొకరికి సోదరభావము కలుగుచున్నది. జగన్నాథ క్షేత్రమునకు రాఖాల్ హరీష్ మున్నగువారు వెళ్లియున్నారు. నీవును వెళ్లితివని తలంపుము. అపుడు మీరందరును వేర్వేఱుగా నుందురా? నీ వెవరవో నీకు గుర్తులేక పోవుటవలన నిన్నాళ్లు నిచటికి రావైతివి. గురురూపమున వచ్చి భగవానుడే సమస్తమును దెలియపఱచును.

తోతాపురి ఈ కథను చెప్పెడివారు: ఆడపులి మేకల మందపై బడెను. దూరములో నున్న వేటకాడు దానినిజూచి, గుర్తించి, కొట్టెను. గర్భస్థమయిన పిల్లపులి క్రింద బడిపోయెను. ఆ పులిపిల్ల మేకలతో కలిసి పెరి

గెను. మొట్టమొదట మేకల పాలే త్రాగుచుం డెను. కొంత పెద్దపెరిగిన పిదప గడ్డి తిన నారంభించెను. మేకవలె నరవ మొదలు పెట్టెను. కొన్నాళ్లకు బాగుగా పెద్దదయినది. కాని గడ్డితినుటయు, బే బే అని అఱచుటయు మానలేదు. వన్యమృగము లేవేని వచ్చి ఆక్ర మించినచో మేకలతోబాటు పరువులెత్తెడిది.

ఒకనాడు పెద్దపులి యొకటి ఆ మేకల మంద పైబడినది. అపుడు అది ఆ మేకల తోబాటు గడ్డితినుచున్న పులినిజూచి ఆశ్చర్య పడినది. మేకలతోబాటు అదియు పరువులెత్తి నది. అంతట అది మేకల నేమియు చేయక గడ్డితినుచున్న పులిపిల్లను బట్టుకొన్నది. అది బే బే యని యఱచుచు పారిపోవ ప్రయత్నిం చెను. కాని ఆ పులి దానిని విడువక నొక జలాశయమునకు దీసికొనిపోయెను. ఆ నీటి లోనికి వంగి, 'ఈ నీట నీ మోమును జూడు'మని ఆజ్ఞాపించినది. 'నీ ముఖము కుండవలె నున్నది. ఇదిగో చూడు'అని చెప్పి దాని నోట మాంసపు ముక్కను బెట్టినది. గొఱ్ఱె పులి దానిని దిను టకు మొదట నిష్టపడలేదు. కాని కొంతసేపటికి రుచి మరగి తిన బ్రారంభించినది. అపుడు పులి 'నీవు మేకల మందలో నుండినందున వాని వలె గడ్డి దినుచుంటివి. ఛీ! నీదియు బ్రదు కేనా?' అని నిందించినది. అందులకు గొఱ్ఱె పులి సిగ్గు చెందినది.—

గడ్డి తినుటయే కామకాంచనములందు మునిగియుండుట. బే బే యని యఱచుటయే సామాన్య జీవరాసుల ఆచరణ. పులితో బోవు టయే గురు—చైతన్యము కలిగించెడివారి— శరణాగతులగుట. భగవంతుని శరణుజొచ్చి ఆయనను ఆత్మీయునిగా నెఱుగుట. ముఖము జూచుటయే స్వస్వరూపావగాహనము.

శ్రీ రామకృష్ణులవారు లేచి నిలుచుకొని యుండిరి. సమస్తమును నిశ్శబ్దముగా నుండెను. గాలికి చలించుచున్న సరుగుడుచెట్ల కొమ్మల శబ్దము, గంగాప్రవాహ శబ్దముతప్ప నితర మేదియు వినిపించలేదు. శ్రీవారు పంచవటిని దాటి తమ గదికి బయలుదేరిరి. వారి మాటలు వినుచు 'మ.' గూడ వారిని వెంబడించెను.

పిదప 'మ.' ఒంటరిగా శ్రీ రామకృష్ణుల వారు ధ్యానముచేసిన కొమ్మక్రింద జేరి ఆ ప్రదే శమునకు నమస్కరించి యిట్లు తలపోయ నారం భించెను: ఇది గురుదేవుని సాధనక్షేత్రము. ఇచట వారెంతయో వ్యాకులభావముతో భగవత్ప్రార్థన చేసియున్నారు. ఎన్నియో ఐశ్వరీయదర్శనములను గాంచియున్నారు. దేవితో ఎన్నియోసార్లు ఎన్నియో విధములగు సంభాషణలు గావించియున్నారు. అందులకే కాబోలు శ్రీ గురుదేవులు వచ్చినపుడెల్ల ఈ ప్రదేశమునకు నమస్కరించుచుందురు!

నహబతు దగ్గర హజ్రాను జూచి, ఇంత యెక్కువ భుజింపకుము. ఆచారము అంతగా నుండవలయు నవసరమునులేదు. మిక్కిలిగా ఆచారమును బాటించువారికి జ్ఞానము లభిం పదు. ఎంతవఱకు అవసరమో అంతటితో నిలుపుము. ఎక్కువ అవలంబింపవలదు. ఇట్లు ఉపదేశించి శ్రీవారు తమగదిని ప్రవేశించిరి.

# శ్రీ అద్భుతానందస్వామి

శ్రీ దువ్వూరి రామకృష్ణారావు, బి. ఏ.

యానిశాసర్వ భూతానాం తస్యాం జాగర్తి సంయమి।
యస్యాం జాగ్రతి భూతాని సానిశా పశ్యతే మునే॥ భ. గీ॥.

(గత సంచిక తరువాయి)

రామచంద్రదత్తు పండ్లు, ఫలాహారములు, నల్పాహారములు రక్తురామునిచే గురుదేవులకు బంపుచుండెడివారు. ఈ పనికి రక్తురాం చాల నానందపడుచు, నప్పటప్పట గురుదేవులతో నొకటి రెండు దినములు దక్షిణేశ్వరముననే గడపుచుండుట యాచారమైనది. క్రమశః రక్తురాం తన సేవకావృత్తిని జేయుటకు విముఖుడై యుండెను. ఆతనికి దక్షిణేశ్వరముననే గురుదేవుల సన్నిధినుండు ధ్యాస మెండైనది. ఈ విషయమును దన యజమానులకు వ్యక్తము చేసెను. వారు రక్తురాంతో, "దక్షిణేశ్వరమున, నీకు గూడు, గుడ్డయు నెవరిత్తుర"ని పరిహాసములు చేసెడివారు. కాని యా కల్ల, కపటము లెఱుగని యమాయకపు బాలుని మనస్సున నా శంకలు కలుగవాయె. ఇంతలో కమ్మరిపుష్కరమునుండి గురుదేవులు వచ్చిన పిమ్మట, దమకు పరిచర్యజేయు సేవకునికై యక్కరపడి, రామచంద్రునితో దమ సేవ జేయుటకు రక్తురామును బంపుమని యడిగిరి. దాని కాతడు వెంటనే యంగీకరించెను. రక్తురామునకు జిరకాలమునుండియున్న గురుదేవుల సేవజేయు మనోరథ మీడేరినది. నాటనుండియు రక్తురాం దక్షిణేశ్వరమున గురుదేవుల సన్నిధి నుండజొచ్చెను. శ్రీరామకృష్ణులును రక్తురాముని ముద్దుగా, "లెటో", "నెటో", "లాటూ" యని పిలుచుచుండిరి. సన్న్యాసులందరిలోను, గురుదేవులకడ చేరుటకు వచ్చిన పరిశుద్ధాత్ములలో లాటూ మహారాజు మొదటివారు (1879).

లాటూ మహారాజునకు బృందగానమన్నను, నృత్యగీతికలన్నను నభిరుచి. రామచంద్రునింట భజన, గానము వినబడగనే, తనపనిని మరచి లాటూ ఆ భజనపరులతో కలయువాడు. దక్షిణేశ్వరమున బృందగానము తరచుగ నుండెడిది. ఇందు లాటూ అత్యాప్యాయముగ, గొప్ప యుత్సాహముతో గలసిపోయి, యానంద నృత్య తరంగిణులలో మైమరచెడివారు. శ్రీరామకృష్ణులచట చేరిన బాలుర, లాటూ మహారాజునందలి యభినివేశమును జూచి వీరలందఱకు గొంతగ నాధ్యాత్మికానుభూతి నిమ్మని యా దివ్యమాతను బ్రార్థించిరి. ఇంతలో నా బాలురెల్లరు వారి ధ్యానమున నా యానందమును జవిచూడ నారంభించిరి. లాటూ మహారాజావిధమున శ్రీవారి సన్ని

ధిని ధ్యానము, భక్తి, సాధనలయందు దిన దిన ప్రవృద్ధిగాంచుచుండిరి.

లాటూ కక్షరజ్ఞానము లేదాయె. ఏ కొద్ది పాటిదైన నక్షరాస్యుని జేయుటకై శ్రీరామ కృష్ణులు తాము స్వయముగ వంగభాషయందలి యక్షరములను లాటూ మహారాజునకు నేర్ప నారంభించిరి. కాని లాటూ బీహార దేశీయుడు. దేశభేదములచే శబ్దోచ్చారణలు భేదించును. శ్రీరామకృష్ణులు మొదటి యక్షరములను వాని యుచ్చారణతో జెప్పి వానిని లాటూను బలుకుమనిరి. లాటూ సంస్కృతమువలె ఆ శబ్దముల నుచ్చరింప నారంభించెను. ఎన్ని పర్యాయములు గురుదేవులు లాటూను సవరణ చేసినను అది తిన్నబడదాయె. గురు శిష్యు లిర్వురు నొకరి నొకరు జూచుకొనుచు, నవ్వు కొనుచుండిరి. శ్రీరామకృష్ణులు నిరాశజెంది, లాటూకు పాఠము జెప్ప మానుకొనిరి. లాటూ మహారాజు విద్యాభ్యాసమునకు స్వస్తివాచక మును జెప్పిరి.

సరియగు గురుశుశ్రూషవలన, నెంత చదువులేనివారైనను చరితార్థులు గాగలరను టకు లాటూ మహారాజు జీవితము మనకు ప్రత్యక్షమైన దృష్టాంతము. శ్రీరామకృష్ణుల సన్నిధి జేరిన నాటనుండియు, లాటూ మనో వాక్కర్మలచే శ్రీవారి సేవలో మునిగి తేలు చుండిరి. శ్రీరామచంద్రులకు హనుమంతు డెటులో, ఆదిశంకరులకు తోటకాచార్యు లెటులో యటులే శ్రీరామకృష్ణులయెడ దాసుడై లాటూ మెలంగెను. శ్రీరామకృష్ణుల యెడ లాటూ మహారాజున కెంత విశ్వాసము! శ్రీవారి వాక్కును వేదాక్షరమువలె పాటిం చెడివారు. బహుశః శ్రమపడియుండుటచే గానోపు నొకనాటి సాయంకాలమున లాటూ మహారాజు నిద్రించుచుండిరి. గురుదేవు లద్దా నిని గమనించి, "నీవటులా సమయమున నిద్రిం చినచో, నీవెప్పుడు ధ్యానించెదవ"నిరి. ఆ మాట శ్రీవారనుసరికి లాటూ రాత్రుల నిద్ర మానుకొనెను. జీవించినంతకాల మే మధ్యా హ్నమో, కొంచెము విశ్రమించి లాటూ రాత్రియంతయు జాగరణము సేయుచుండెను. ఇటుల గీతలో జెప్పబడినటుల ప్రపంచమంతయు నిద్రించు రాత్రిసమయమున నా యోగిపుంగవు డెరుకతో, మెలకువగ పగటివలె గడపెడి వారు.

లాటూ మహారాజు కల్ల కపటము లెరుగని యమాయకుడు గాన, విద్యావంతులవలె ఆలోచనలకు, తర్కవాదములకు, నిజానిజ ముల దేల్చుటకు గాలహరణము సేయక, శ్రీవారు నోట మాట చెప్పియు జెప్పకయే తా నద్దాని ననుష్ఠానమున, ఆచరణరూపమున, బెట్టెడివారు. రెండవ ప్రవృత్తి లేక ప్రేమ-భక్తి భావములతో, గురువాక్యమును పాలిం చుచుండుటచే, లాటూ మహారాజు క్రమేణ ఆధ్యాత్మిక పరిణామము నొందుచుండిరి. ఆ వినయమూర్తియగు లాటూ మహాముని తా నెంత మందబుద్ధియైనను, బహుశ్రమలబడుచు, నీశ్వరకటాక్షమునర్థాత్మకై, తనజీవితమును సవరించుకొనుచు, చరితార్థమును సాధించి, తరియించిరి. శ్రీరామకృష్ణుల కృపాకటాక్ష మున, శ్రీవారు చెప్పినటుల లాటూవంటి పెద్ద కళేబరమగు నొంటె సూది బెజ్జముగుండా దూర్చబడెను.

శ్రీరామకృష్ణులు లాటూ మహారాజున కాధ్యాత్మికచింతన నుపదేశించెను. వెంటనే

లాటూ మహారాజు గురువాక్యమునందు బ్రహ్మాండమైన విశ్వాసముతో నా యుపదేశ సాధనయందు రేయింబవళులు మైమరచి యుండెడివారు. ఇట్లు ధ్యాననిమగ్నులై మైమరచిన సన్నివేశము లెన్నియో లాటూ మహారాజు జీవితమున గలవు. ఒకనాడు గంగానది యొడ్డున గూర్చొని ధ్యాననిష్ఠలోనుండ, గంగ పొంగి, లాటూ మహారాజును జుట్టివైచెను. కాని లాటూ మహారాజునకు బాహ్యస్మృతి లేదాయె. ఈ విషయము శ్రీరామకృష్ణుల చెవిని బడగనే శ్రీవారు లాటూ మహారాజు నతిత్వరితగతిజేరి, యేదియో చెవులలో చెప్పగనే లాటూ మహారాజునకు స్మృతి వచ్చినది. మరియొకనాటి మధ్యాహ్నము లాటూ మహారాజు శివాలయమునకు వెళ్లి, ధ్యానముజేయు చుండెను. సాయంసమయమైనను లాటూ మహారాజు గనబడడాయె. అంతె నాతని వెదకించి, వారున్న తావును దెలిసికొని, శ్రీరామకృష్ణులు లాటూ మహారాజునొద్ద కేగి జూడబోవ లాటూ మహారాజు చెమటలు గ్రమ్మి తన్మయులై యుండిరి. శ్రీరామకృష్ణు లాతని ప్రక్క నిలిచి, యాతనికి స్మృతివచ్చువరకు, విసరుచు నిలువబడియుండిరి. ఈ విషయము సమస్తము దెలిసికొని లాటూ మహారాజు తత్తరపడెను. అంత తన మృదు, మధుర వాక్యములతో నాతని శ్రీవారు స్వస్థచిత్తుని జేసిరి. శ్రీరామకృష్ణులు లాటూ మహారాజును గూర్చి ప్రసంగించుచు, ఆ యానందభావస్థితి నుండి ఆ మహాత్మునకు బతనము గలుగదని నుడివిరి.

గడ్డిపోచ యెగురుటనుబట్టి గాలి యెటుల వీచుచున్నది గమనింపగలము. చిన్నివిషయము లైనను వానినిబట్టి లాటూ మహారాజు మనస్సును గనిపెట్టగలము. ఒకనాడు లాటూ మహారాజు పరమపద సోపానమను పఠముపై నాట నాడుచుండిరి (గోలకధామ్ వైకుంఠ పాళి). ఇందులో నెవరికాయ వారు త్వరలో గోలకధామమును జేర్పవలెనను ధ్యాస మెండు. లాటూ మహారాజు కాయ పండి, పరమపదము చేరగనే, వారి యానందము వర్ణనాతీతముగ నుండెను. తమ జీవితమే పరమావధి జేరినట్లు వా రానందించిరి. శ్రీరామకృష్ణు లీయాటను జూచుచుండిరి. తన ముక్త్యపార్జనమునకై యంత ధ్యాసగా లాటూ మహారాజుండి యున్నారని శ్రీరామకృష్ణులు నుడివిరి.

అనేకజన్మములనుండి, గాఢమగు తపస్సును జేసినగాని నిష్కపటముగ మాట్లాడు సుగుణము గలుగదని, నిష్కపటముగ నుండినగాని సూక్ష్మముగ నీశ్వర సాక్షాత్కారము గాదనియు శ్రీరామకృష్ణులు చెప్పెడివారు. లాటూ మహారాజును దర్శించిన ప్రతి వ్యక్తి వారియందున్న పసిబాలునివంటి మనస్సును గనిపెట్టుచుండిరి. లాటూ మహారాజు తామెటుల తమ కండరములతో గష్టించిరో, రహస్యములేక, విస్పష్టముగ గురుదేవులతో జెప్పి, శ్రీవారివలన బోధలను గ్రహించుచుండెడివారు.

శ్రీరామకృష్ణు లొకపర్యాయము లాటూ మహారాజు నహర్నిశలు ఈశ్వరుని మరువవలదని బోధించిరి. లాటూ మహారాజు తాముచేయు సాధనలన్నిటను పవిత్రనామసంకీర్తనకు బ్రాముఖ్యతనిచ్చువారు. వారిని సలహా లడుగువారల కీ విషయమునే లాటూ మహారాజు ప్రబోధించువారు. మన మెన్నడును జూడని భగవంతున కెటు లాత్మసమర్పణము చేయుట యని యొక భక్తు డతిదీనముగ లాటూ మహారాజును బ్రశ్నించెను. లాటూ మహా

రాజు తమ యసమానమగు గాంభీర్యముతో నతిసూక్ష్మముగ నిటులు బదులు చెప్పిరి: "భగవంతుని జూడకపోయినను ఫరవాలేదు. ఆతని నామము నెరుంగుదురుగదా! ఆతని నామమును దీసికొనిన, నీ వాధ్యాత్మికోపలబ్ధిని బొందగలవు. ఏ కచ్చేరీలోనైన నేమి చేయుదువు? ఉద్యోగి నీకు తెలియకపోయినను, నాతని జూడకపోయినను వారిపేర దరఖాస్తు నంపుదువు. ఆ విధముగనే భగవంతునికి నీ దరఖాస్తును పంపుము. నీకు ఆయన యనుగ్రహము కలుగును."

ఎట్టి యాధ్యాత్మిక సాధన యున్నను గురుదేవుల సేవ నతిముఖ్యముగ లాటూ మహారాజు పరిగణించువారు. శ్రీవారి సేవలు చేయుచుండ నీశ్వరారాధన కెటుల గాలము కుదురునని కొందరడుగ, "మంచిది! శ్రీవారి పరిచర్య నా యుత్కృష్టమగు ఆరాధన, ధ్యానము"ని లాటూ మహారాజు వారలతో బదులు జెప్పువారు. లాటూ మహారాజు దక్షిణేశ్వరమున, శ్యామపుష్కరిణి యందు, కాశీపురోద్యానవనమున శ్రీరామకృష్ణుల నిర్యాణమువరకు పరిచర్యచేసిన ధన్యజీవి. ఒకపర్యాయము సన్న్యాసలక్షణముగ, గురుదేవులు కాషాయాంబరములను దమ శిష్యుల కిచ్చియుండిరి. ఆ ప్రతిగ్రహీతలలో లాటూ మహారాజొకరు. ఆతని యద్భుత చరిత్రమునుబట్టి శ్రీరామకృష్ణుల నిర్యాణానంతరము సన్న్యాసదీక్షాసమయమున, లాటూ మహారాజున కద్భుతానందస్వామి యను నామకరణము సేయబడెను. వరాహనగర మఠ ప్రారంభకుల మువ్వురలో లాటూ మహారాజొకరు. తర్వాత నితర సోదరబృందము పూర్తియైనది.

శ్రీరామకృష్ణుల నిర్యాణానంతరము లాటూ మహారాజు శారదామాతతో బృందావనమున కేగి, యచట కొలది కాలము గడపెను. లాటూ మహారాజు శ్రీ శారదా దేవిని శ్రీ గురుదేవులతో నభిన్నమైన గౌరవప్రపత్తులతో భజియించెడివారు. శ్రీమాతయు వీరిని దమ బిడ్డనివలె జూచెడివారు. దక్షిణేశ్వరమున దల్లి కష్టములు బడుచుండిన కాలమున లాటూ మహారాజు మాతృదేవికి జాల సాయపడెడివారు. శారదామాతది సహజముగ సిగ్గుపడియెడి స్వభావమైనను, లాటూ మహారాజు పల్లెటూరినుండి వచ్చిన బాలుడు గాన ఆమె యాతనితో గలసి మెలసి యుండెడిది. లాటూ మహారాజు శారదామాతయెడల వారి యాజన్మాంతమును జూపిన భక్తిప్రేమలు వర్ణనాతీతములు.

వరాహనగర మఠమునందు వారి గురుభాయిలతో లాటూ మహారాజు ఒక సంవత్సర మున్నర కఠినమైన యాధ్యాత్మిక సాధనను చేసిరి. పగ లేకొలది కాలమో నిద్రించి, రేయింబవళు లేదో రకమగు సాధనలో లాటూ మహారాజు కాలము పుచ్చెడివారు. జీవితాంతమువరకు వా రా విధముగ గాలక్షేపము చేసిరి. ఆ మఠమునందుండ లాటూ మహారాజున కురోవాతము చేసినది. మంచముపై లేవలేనంత జబ్బుగ నుండెను. ఇట్లు కూర్చొనుటకు శక్తి లేకున్నను, సాయంకాలమున దమ నిష్ఠకై ప్రక్కమీద గూర్చొనబెట్టుడని ప్రక్కనున్నవారిని గోరిరి. వైద్యులు వారినటుల గూర్చొననీయరాదని చెప్పియుండిరి. అంత లాటూ మహారాజు, "వైద్యునికేమి తెలియును. ఇది గురుదేవుల యాజ్ఞ. అటుల, నే నాచరించి తీరవలసినదే" యని వారికి జెప్పిరి. వారు సాధ

నలో నెంత నిమగ్నులై యుందురన, వారికి కాలజ్ఞానము, భోజనసమయములు బొత్తుగా గుర్తుండెడివిగావు. ఈ కారణమున వారి భోజనము వారి గదికి, బంపబడియెడిది. అనేక పర్యాయము లుదయమున బంపబడిన భోజనము రాత్రివరకును ముట్టబడకయే నిలువయై యుండెడిది. వారికి భోజనము చేయలేదను గుర్తే యుండెడిదిగాదట.

రాత్రి అందఱును మేల్కొనియుండునపుడు, లాటూ మహారాజును నిద్రించునటు లగుపడెడివారు. అందరు గాఢనిద్రలోనున్న సమయమున వారు లేచి కూర్చొని తావళము త్రిప్పుచుండుట యాచారము. ఒకనాడు అట్టి సమయమున నొక చమత్కారము జరిగినది. లాటూ మహారాజు తావళము త్రిప్పుచుండ శబ్దమైనది. వారి గురుభాయి యొకరు గదిలో నెలుక ప్రవేశించి, చప్పుడుచేయుచున్నదనుకొని లేచి, దీపమును వెలిగించి చూడ, లాటూ మహారా జెవరికిని దెలియకుండ దావళము త్రిప్పుచుండుట కనిపెట్టబడినది. అప్పటినుండియు వారి తోటి సోదరులు లాటూ మహారాజును వారి చమత్కారమునకు, బుద్ధికుశలతకు హాస్యముచేయుచుండిరి.

లాటూ మహారాజు వారి సంఘ నిత్యక్రమ నియమములను పాటింపక, వారి మార్గమునే వారు నడచెడివారు. ఈ కారణమున ఆలంబజారు మఠమునందు, బేలూరు మఠమునందు ఏ కొలది దినములో వసించుచు, దరచు లాటూ మహారాజు బయటనే యుండు నాచారము. వివేకానందులు మఠమునం దుషఃకాలమున గంట వినబడగనే ప్రతివారును లేచి ధ్యానము చేసికొనవలెనను నియమమును చేసిరి. ఆ మరునటి దినమున, లాటూ మహారాజు మఠము నుండి బయటకు మూట ముల్లెతో వెళ్లిపోవుచుండిరి. ఈ విషయము స్వామీజీ చెవులబడి, దీనికి గతంబేమియని లాటూ మహారాజు నడిగిరి. "నా మనస్సు గంటకొట్టునప్పటికి ధ్యానమునకు సిద్ధముగానుండు స్థితికి రాలేదు. మీ నియమితకాలములకు నేను ధ్యానమునకు గూర్చొను శక్తి నాకు లేద"ని లాటూ మహారాజు సమాధానము జెప్పిరి. స్వామీజీ, విషయమునంతను గ్రహించినవారలై, లాటూ మహారాజున కా నియమము వర్తింపదనిరి.

తమ శరీరార్థములు లోకులకు బాధగ నుండనట్లును, తమ యాంతరంగిక ప్రశాంతికి బాహ్యప్రపంచముచే కలత కలుగజాలనట్టి, అనగా భగవద్గీతలో జెప్పినయట్లు దమవలన లోకము, ద్వేజితముగాక లోకమువలన దామును ద్వేజనమును బొందనట్టి స్థాయిలో లాటూ మహారాజు నిలిచెడివారు. ఆహార విషయములో లాటూ మహారాజునకే నియమములు లేవు. సమయాసమయములబట్టి యే గింజలనో నానపెట్టుకొని, తిని క్షుద్బాధను నివారించుకొనియెడివారు. లాటూ మహారాజొక్కొక్క సమయమున గురుదేవుల భక్తునకు జెందిన, 'వసుమతి' ముద్రాక్షరశాలలోని యొక గదియందుగాని, దరచుగా నే యాచ్ఛాదనలేని గంగయొడ్డునగాని కాలము గడిపెడివారు. ఆచ్ఛాదన యుండవచ్చు, లేకపోవచ్చు, పగలు స్నానములుజేయు రేవున, రాత్రుల మరియొక స్నానములుజేయు రేవున నుండెడివారు. రాత్రుల గస్తీ తిరుగు పోలీసువారలందఱకు లాటూ మహారాజు గుర్తే! ఒకసారి యొక భక్తుడంత శబ్దముచేయు నాయచ్ఛాదీసునం దెటుల నివసించుచున్నారని ప్రశ్నింప, వారేమియు నిబ్బంది పడుటలేదని జవాబు

నిచ్చిరి. ఒకనాటిరాత్రి వర్షించుచుండెను. సరకులు వేసికొని వెళ్లుటకై, లాటూ మహారాజు తమప్రక్కన నిలిచియున్న ఖాళీ రైలుపెట్టెలో వారు తలదాచుకొనిరి. ఇంతలో నా పెట్టెలకింజను తగులుకొని యా రైలుబండి వెళ్లిపోవుచుండెను. చాలదూర మటుల వెళ్లిన పిమ్మట లాటూ మహారాజునకు గుర్తువచ్చి, బండినిదిగి స్వస్థానమును జేరుకొనిరి.

లాటూ మహారాజునందలి శక్తికంతయు మూలాధారము, వారు గురుదేవులపై భారమునువైచి శ్రీవారిని నమ్మియుండుటయే. గురుదేవులు తమ కవసరమగువానిని జేకూర్చుదురనియు, దమకు మంచినే సమకూర్చుదురనియు లాటూ మహారాజు సదా తలంచువారు. ఇటీవల తమ సలహాను కోరినవారికిటుల లాటూ మహారాజు చెప్పువారు: మీరు భగవంతు నంత దృఢముగా నాశ్రయించియుండలేదు. మీ కిష్టప్రకారము ఫలసిద్ధి గలుగని-చో, రెండుదినములలో దేవుని వదలి, మీ రాతనికన్న బుద్ధిమంతులమనుకొని, మీకు దోచినవిధమున బ్రవర్తింతురు. గొప్పకష్టములు గలిగిన, నీశ్వరుని విడువకుండుట నిజమగు శరణాగతి.'' లాటూ మహారాజునకు గురుదేవులయందు ఈశ్వరునియందు గల విశ్వాసమును బ్రపంచమునందలి యే మోహమును చలింపజేయదు. లాటూ మహారాజిట్టి ప్రశాంతచిత్తమున బ్రార్థనలు చేయుచు, గురుదేవుల సాధనలకు రంగస్థలమగు దక్షిణేశ్వరమున విస్తారముగ విహరించువారు.

(సశేషము)

---

# రామప్రభూ!

రచన : సాలగ్రామ-కాశీవిశ్వనాథశర్మ

శా. క్రూరాత్ముండను బుద్ధిమై నెడదలో ఽ గోపంబు దీపించెనా
పారంబింతయులేని సత్కరుణ; నన్ ఽ పాలింపరావేల బల్
గారాబంబున బ్రోచు తండ్రి, కొడుకుల్ ఽ గావించు దోషంబులన్
భారంబా నను బ్రోవ బ్రోవగదవే ఽ పట్టాభిరామప్రభూ! 1

శా. నీ పాదంబులె దిక్కు నాకనుచు ని ఽ న్నే నెమ్మదిన్ నమ్మితిన్
నాపై నీ కరుణాకటాక్షలవమున్ ఽ న్యాయంబ! చూపింపవో
ఆపద్బాంధవ దీనరక్షక అహో ఽ ఆర్తావనా రాఘవా!
ప్రాపై బాపవె దేవ నాదువెతలన్ ఽ పట్టాభిరామప్రభూ! 2

శా. పాపంబుల్ కడుజేసినాడ మిగులన్ ఽ పాపక్రియాలోలుడన్
పాపస్వాంతుడ! పాపచింతనుడ, పా ఽ పాత్ముండ, పాపార్తుడన్
పాపిన్ నీ కరుణాకటాక్షమున నా ఽ పాపంబులన్ బాపవే
పాపారణ్య దవానలా రఘుపతీ – పట్టాభిరామప్రభూ! 3

శా. పాపాత్మ్ముండని వీడబోకు వరనీ ఽ పాదాబ్జ సంసేవచే
నా పాపంబులడంగవే వెతలు నా ఽ నాదిక్కులన్ బట్టవే
దీపంబుల్ వెలిగింప నింట తమమున్ ఽ తేజంబువే బాపదే
ప్రాపై నీ పదభక్తి నాకొసగవే ఽ పట్టాభిరామప్రభూ! 4

శా. ఓపంజాలను పాపబాధలకు ; న ఽ న్నూరార్పవే రాగదే
నీపై భారము మోపి నే సతము హృ ఽ న్నీరేజ మధ్యమ్మునన్
నీ పాదమ్ములె నమ్మివమ్మయిన ; న ఽ న్నేదిక్కు బొమ్మందు నీ
ప్రాపుం గోరితి నన్ను నేమఱకుమీ ఽ పట్టాభిరామప్రభూ! 5

శా. నాథుల్ లేరిక నీవుదక్క కరుణన్ ఽ నాధా మొఱాలింపకే
వేధింపన్ దగునయ్య? నన్వెతల ; ని ఽ న్వేడంగ నే దీనతన్
శోధింపన్ బనియేమి నన్నిక? మన ఽ శ్శుద్ధిన్ నినున్ నమ్మితిన్
బాధల్ వెట్టక కావుకావు కృపతో ఽ పట్టాభిరామప్రభూ! 6

శా. దేవా! దివ్యవిభావ! భవ్యచరితా! ఽ దీనావనా! పావనా!
సేవాప్రీతభవాభవా! శుభకరా! ఽ సీతామనోనాయకా!
జీవాధార! పరాత్పరా! దశదిశా! ఽ జేగేయకీర్త్యోదయా!
భావాతీత! సరామరామ! వరదా! ఽ పట్టాభిరామప్రభూ! 7

మ. జనకుల్ తల్లులు నెందరెందరొ! మరిన్ ఽ జన్మంబులెన్నాయెనో!
గణనాశక్యమె! ముందుజన్మ లికెటుల్ ఽ గానున్నవో! యెన్నియో!
జననంబందితి పూర్వకర్మముల సం ఽ సారాబ్ధి భీతుండ ; పా
వన సీతాపతి పాహి పాహి కృపతో ఽ పట్టాభిరామప్రభూ! 8

శా. నీకంటెన్ ఘను లేరు లేరు జగతీ ఽ నిర్మాణకా, లేరహో
నాకంటెన్ కడుదీను లీజగతిలో ఽ నన్నేల పాలింపవో
శ్రీకంఠాబ్జభవేంద్ర వంద్య పదరా ఽ జీవాభిరామా! నమో
వాకంబుల్ శరణార్థి బ్రోవగదవే ఽ పట్టాభిరామప్రభూ! 9

శా. కన్నుల్ కాయలుకాచె ; రావికను న ఽ న్గావంగ ; నీతోడు నూ
ఉన్నావీవని కాళ్ల వ్రేళ్లబడి మొ ఽ ఱ్ఱోయన్న విన్పించుకో
వున్నారే ఒరులార్ప దీర్పగతి ; అ ఽ య్యోనాదుకుయ్యోడు నా
పన్నానేకశరణ్య బ్రోవగదవే ఽ పట్టాభిరామప్రభూ! 10

శా. కామోత్కంఠత మన్నుమిన్నుగన కే ఽ కాంతావిలోలుండనై
యీ మేనుఁ గడునమ్మి యౌవనమదం ఽ బేపార అజ్ఞానతన్
ఏమోచేసితి పెక్కుకర్మలను న ఽ న్నేవంక పాలింతువో
స్వామీకావవె యీ సుదీనుని కృపన్ ఽ పట్టాభిరామప్రభూ! 11

శా. మున్నే నింతగ వేడితే వెతలతో । మొఱ్ఱోయనన్ వింటివే
గన్నీరింతగ కాల్వలై నదులుగా । గారంగ నేకుయ్యిడన్
ఉన్నావా! భగవంతుడన్న ఘనుడా । ఊకొట్టుచున్నావ! ఆ
పన్నుల్ బిల్వగ పల్కవే కరుణతో । పట్టాభిరామప్రభూ! 12

శా. కాంతాలోలుప లంపటుండనయి బల్ । గర్వోన్నతిం జెందుచున్
సంతోషాబ్ధిని దేలుచున్ సతతమున్ । సంసారబద్ధుండనై
జింతంజెందెదు నేడు దావెతల దు । శ్చేష్టాది పాపంబులన్
స్వాంతంబింతగ దేవ బ్రోవగదవే । పట్టాభిరామప్రభూ! 13

మ. మితభాషిత్వమువీడి గర్వమున దు । ర్మేధన్ బ్రవర్తిల్లి నే
నతికామాంధుడ లుబ్ధచేతసుడ పా । పాత్ముండ మత్తుండ దు
ర్మతి నీ దేహము కాల్పనే? అఘములే । మార్గంబునన్ బోవు? నా
పతి నీవే శరణార్థి బ్రోవగదవే । పట్టాభిరామప్రభూ! 14

మ. ఎఱుగన్ చేసితినన్నమాత్రమున నా । యీ పాపముల్ వోవునే?
ఎఱుకే లేకటు ముట్ట కాల్పదె! మనం । బే పారజ్ఞానంబొగిన్
బరగన్ నీ కరుణాగ్ని మత్కృత మహా । పాపాటవిన్ గాల్పదే!
పరమాత్మా శరణార్థి బ్రోవగదవే । పట్టాభిరామప్రభూ! 15

శా. నీవాడన్ నిను నమ్మినాడననుచున్ । నిన్నింత నే వేడగా
కావన్ రావదియేమి నన్ను కరుణన్ । కారుణ్యరత్నాకరా!
నీవే దిక్కని మ్రొక్కగా నొరులు న । న్నే రీతి రక్షింతురో
భావాతీత! భవాబ్ధిపోత! సుకృతీ । పట్టాభిరామప్రభూ! 16

శా. కాంతాకామము మోహకారణము బల్ । కష్టాతిరేకంబు దు
శ్చింతాప్రాభవహేతువౌ మిగుల; పెన్ । జీవంపు టాయాసమున్
సంతాపంబున కిక్కయౌ ఘనమహా । సంసార ప్రాపంచిక
భ్రాంతిన్ జెందిన నన్ను బ్రోవగదవే । పట్టాభిరామప్రభూ! 17

శా. నేరంబుల్ తలపన్ బనేమిక, గడున్ । నిన్నింత నే నమ్మగా
రారే త్రాతలు కావవే వరద సం । రక్షింపు సర్వాత్మకా
దారిద్ర్యానలదగ్ధసంసరణ కాం । తార ప్రపీడార్తుడన్
పాఱుండన్ కడుదీనుడన్ వికలుడన్ । పట్టాభిరామప్రభూ! 18



# శ్రీ వివేకానంద సంభాషణలు

## (శ్రీ శరచ్చంద్ర చక్రవర్తి)

అనువాదకుడు : శ్రీ పిన్నింటి సుబ్బారావు

[స్థలము :—కాశీపూర్ స్వర్గీయ గోపాలలాల్ సేనుని యారామము. సం॥ 1897.]

పాశ్చాత్య ప్రథమ సంచారమును ముగించి, తిరిగివచ్చిన పిమ్మట, స్వామిజీ స్వర్గీయ గోపాల లాల్ సేనుని యారామమునందు కొంతకాలము నివసించిరి. ఆలంబజారు, కలకత్తా పట్టణముల యందలి ప్రసిద్ధికెక్కిన పండితులు కొందరు స్వామిజీతో తర్కించుటకు వచ్చియుండిరి. ఈ శిష్యు డా సందర్భమున నచట నుండెను.

అచ్చటి కరుదెంచిన విద్వాంసులందరును అనర్గళముగా సంస్కృతమునం దుపన్యసింప గలరు. ప్రేక్షకుల మధ్యనున్న స్వామిజీకి వారు నమస్కరించి, సంస్కృతమున నుపన్యసింప దొడగిరి. స్వామిజీగూడ వారి కతిమధురమగు సంస్కృతభాషలో ప్రత్యుత్తర మిచ్చిరి. ఆ రోజున పండితులు, స్వామిజీతో ఏ విషయ మునందు తర్కించిరో యీ శిష్యునకు జ్ఞాపకము లేదు, కాని యా విద్వాంసులందరును, ఉచ్చైస్స్వరమున, ఏకగ్రీవముగా, వేదాంత తత్త్వమున గల జటిల సమస్యలగూర్చి సంస్కృతమున ప్రశ్నించుచు, స్వామిజీని కలవరపెట్టుచుండిరి. శ్రీవారు ఆ ప్రశ్నలకు తమ యనుభవపూర్వక సిద్ధాంతముతో, గంభీరముగను ప్రశాంతముగను ప్రత్యుత్తర మిచ్చిరి.

ఈ వివాదమందు స్వామిజీ, సిద్ధాంతపక్షమును, విద్వాంసులు పూర్వపక్షమును అవలంబించిరి. ఈ తర్క మధ్యమున స్వామిజీ 'స్వస్తి' యను పదమునకు మారుగా 'అస్తి' యను పదమును ప్రయోగింప, ఆ విద్వాంసులు బిగ్గరగా నవ్వినట్లు ఈ శిష్యునకు జ్ఞాపకమున్నది. దీనికి స్వామిజీ వెంటనే "పండితానాం దాసోహం క్షన్తవ్యామేతతు స్కలనమ్"—"నేను విద్వాంసులకు దాసుడను. ఈ దోషమును క్షమింపుడు" అని ప్రార్థించిరి. స్వామిజీయొక్క వినయమున కా విద్వాంసు లాశ్చర్యమును పొందిరి. దీర్ఘ వివాదమునకు పిమ్మట, వారు స్వామిజీయొక్క సిద్ధాంతపక్షము యుక్తముగా నున్నదని నుడివి, శ్రీవారికి నమస్కరించి వెడలిపోయిరి.

ఈ విద్వాంసులు వెడలిన పిమ్మట, స్వామిజీ యీ శిష్యునితో, ఈ విద్వాంసులందరును పూర్వమీమాంసాశాస్త్రములను బాగుగాపఠించిరని చెప్పిరి. స్వామిజీ ఉత్తరమీమాంసా పక్షము నవలంబించి, వేదాంతము, లేక జ్ఞాన మార్గముయొక్క యాధిక్యతను స్థాపింపగా వారీ సిద్ధాంతమును ఒప్పుకొనక తప్పినది గాదు. పండితులతో వారు వాదించినప్పుడు

తా నొనర్చిన వ్యాకరణ స్కాలిత్యమునకు తాను సంస్కృతమున సంభాషించి పలువత్స రములగుటయే కారణమని సెలవిచ్చిరి. పండితు లా విధముగా తన్ను పరిహసించినను, వారి నేమాత్రమును అధిక్షేపింపలేదు కాని యసలు విషయమును విడిచి, యిట్టి భాషాదోషములను ప్రత్యర్థ లెన్నుట, పాశ్చాత్య దేశీయులు చాల అమర్యాదగా భావింతురని నుడివిరి. భాషా విషయ మటుంచి, యందలి విషయమునే ప్రధా నముగా నెంచుట నాగరిక సంఘములు చేయు పని యని నుడివిరి. ఈ దేశములో ' బాహ్య విషయములనుగూర్చియే కలహమును జేయు చున్నారు గాని, అసలు విషయమును గ్రహిం చుట కెవ్వరును శ్రద్ధవహించుటలేదని పలికిరి. ఈ విధముగ జెప్పుచు, స్వామిజీ శిష్యునితో సంభాషించుట కారంభించెను. శిష్యుడుగూడ వచ్చియురాని సంస్కృతభాషలో జవాబిచ్చెను. అయినను స్వామిజీ యింతమాత్రముననే, యాతని కుత్సాహము గలుగుటకై ప్రశంసిం చెను. అప్పటినుండియు, స్వామిజీ కోరికపై, వారితో నా శిష్యుడు సంస్కృతభాషయందే తరచుగా ప్రస్తావింప నొడగెను.

"నాగరికత యన నేమి" యను ప్రశ్న కొరోజున, స్వామిజీ యీ క్రింది విధముగా ప్రత్యుత్తరమిచ్చెను :

ఒక సంఘముగాని, యొక జాతిగాని, యాధ్యాత్మికముగా ఎంత యౌన్నత్యమును పొందునో యంత ఎక్కువగా, ఆ సంఘము గాని, జాతిగాని నాగరికత జెందగలదు. భౌతిక సుఖజీవనమునకు వలయు సాధన సంపత్తిని యంత్రములద్వారా యుత్పత్తి నధికముగా జేసినంతమాత్రమున, నా సంఘము నాగరికత గలదని జెప్ప వీలుగాదు. నేటి నవీన నాగరికత వలన, ఏ రోజున కా రోజు మానవునియందు విషయవాంఛలును, విచారములును వృద్ధి యగుచున్నవి. అట్లుగాక భారత నాగరికత యాధ్యాత్మికాభివృద్ధికి మార్గమును జూపి, యైహికవిషయభోగములయందలి విరక్తి శాశ్వ తముగా నుండునట్లు చేయలేకపోయినను; అధి కముగా తగ్గించుకొనునట్లు నిస్సందేహముగా జేయగల్గెను. ఈ ప్రస్తుతయుగమున, నీ ద్వివిధ నాగరికతలను సమన్వయపరచుటకే శ్రీరామ కృష్ణ భగవాను లవతరించిరి. ఈ యుగములో, ప్రజలొకవైపున తీవ్రముగా ఆదర్శప్రాయు లుగ జీవించుచు, మఱియొక ప్రక్క ఆధ్యాత్మిక జ్ఞాన మెక్కువగా సంపాదింపవలయును. భారత నాగరికత, పాశ్చాత్య నాగరికతతో మేళన మగునాడు క్రొత్తయుగ మవతరింపగలదని స్వామిజీ యానాడు మాకు స్పష్టపరచెను. ఈ విషయమునుగూర్చి విపులముగా ముచ్చటిం చుచు, ఒకానొక సందర్భమున, "పాశ్చా త్యులు, మానవు డెంతగా మతమునం దాసక్తిని గలిగియుండిన, బాహ్యమున నంత గంభీర ముగా నుండవలెనని భావించెదర"ని చెప్పెను. పాశ్చాత్యులు నా విశాల మతోపన్యాసముల కచ్చెరువొందుచు, వెనువెంటనే నా మిత్రు లతో నతిపరిచయముగా సంభాషించుటను జూచి యత్యాశ్చర్యమును పొందుచుందురు. నా యెదుటనే వారు "స్వామీ మీరు మత బోధకులుగదా, సామాన్య మానవునివలె పరి హాసముగను, నవ్వుచును సంభాషింపరాదు. తమరంత చనువుతో సంభాషించుట భావ్యము గాదు" అని చెప్పుచుందురు. దానికి నేను వారికి, "మన మానందమయుని బిడ్డలము. మన మెందుకు కోపముగను, మౌనముగను

నుండవలయును'' అని జవాబిచ్చుచుందును. కాని వారు నా జవాబుయొక్క యంతరార్థమును గ్రహించిరో లేదో యని నేను సందేహించుచున్నాను.

ఆ రోజున స్వామిజీ, భావసమాధినిగూర్చియు, నిర్వికల్పసమాధినిగూర్చియు, అనేక విషయములను ఈ విధముగా దెల్పిరి.

హనుమంతుడు సాధించిన భక్తి సాధనను ఒకడు సాధించుచున్నాడనుకొందము. ఉద్దేశ్య మెంత తీవ్రమైన అది యంత ఎక్కువగా వాని ఆకారము, వైఖరి, చివరకు వాని స్థూల రూపమునందుగూడ ప్రతిఫలింపగలదు. జీవ రాసులయందు మార్పు ఈ విధముగనే జరుగుచుండును. అట్టి భావోద్రేకమునందా సాధకుడు పూర్తిగ తానుద్దేశించిన లక్ష్యమునందు సిద్ధిని గాంచగలడు. దీనినే భావసమాధి యందురు. జ్ఞానయోగి, 'నేతి నేతి' యను భావములతో, నేను శరీరమునుగాను, మనస్సునుగాను, బుద్ధినిగాను—అని యీ విధముగా తత్త్వవివేచనను జేసి, శాశ్వతసత్యమునందు సిద్ధిని బొంది నిర్వికల్పసమాధిని బొందును. భక్తిసాధనలయందొక్కదాని యందు పరిపూర్ణతను బొందుట కనేక జన్మములను దాల్చవలసియున్నది. కాని ఆధ్యాత్మ తత్త్వమునకు ప్రభువగు శ్రీరామకృష్ణుడు పదునెనిమిది విధములగు భక్తిసాధనల నాచరించి, పరిపూర్ణ సిద్ధిని బడయగలిగెను. ''ఈ ఆధ్యాత్మిక సాధనలను తా నాచరింపనిచో, తన శరీర మంతకాలము నిల్చేడిదిగాదని'' వారు చెప్పెడివారు.

శిష్యుడా రోజున ''అయ్యా, తమరు పాశ్చాత్య దేశములయందెట్టి యాహారము స్వీకరించెడువారు'' అని స్వామిజీని ప్రశ్నించెను.

స్వామిజి:—వారెట్టి యాహారమును భుజింతురో, నేనును అట్టి యాహారమునే గైకొంటిని. మేము సన్న్యాసులము. మమ్ముల నేదియును కులభ్రష్టుల జేయ నేరదు.

తమ భవిష్యత్కార్యక్రమమునుగూర్చి స్వామిజీ యీ విధముగా దెల్పిరి: ''మద్రాసులో నొకటియును, కలకత్తాయందొకటి యును, కేంద్రములను స్థాపించి, మానవుల కన్నివిధములగు హితములను ఒనర్చుటయే జీవితలక్ష్యముగాగల సరిక్రొత్త యతులు తయారుజేయబడుదురు. మఱియు వినాశకరమగు విధానములవలన, సంఘముగాని, జాతిగాని యభివృద్ధి నొందజాలదు. అన్నియుగములయందును ప్రాతపద్ధతులకు నవజీవనము పోయుటవలననే యభివృద్ధి నొందగలిగెను. పూర్వమందలి ప్రతి భారతీయ మతబోధకుడును ఆ రీతిగనే యొనర్చెను. బుద్ధభగవానుని మత మొక్కటియే వినాశకరమగు మార్గము నవలంబించెను. అందువలననే యా మతము భారతదేశమందుండి యదృశ్యమయ్యెను.''

ఈ విధముగా సంభాషించుచు, వారీ దిగువ రీతిగాగూడ వచించిరని యీ శిష్యునకు జ్ఞాపకముండెను. ''పరబ్రహ్మసిద్ధి యొక మానవునికి గలిగినచో, ఆ దారి ననుసరించి వేలకొలది తరింపగలరు. బ్రహ్మమునుగూర్చి తెలిసిన వారే మానవుల కాచార్యులుగా నుండగలరు. ఈ సత్యమును అన్ని మతగ్రంథములు, హేతువులు ఋజువుచేయుచున్నవి. వేద, శాస్త్రములకు వ్యతిరేకమగు వంశపరంపరాగతమగు కుల

గురువు పద్ధతిని స్వార్థులగు బ్రాహ్మణు లీ దేశమునందు ప్రవేశపెట్టిరి. అందుచే వారి ఆధ్యాత్మిక సాధనలను వీ రనుష్ఠించుచున్నను, అందు జయమునుగాంచి బ్రహ్మనిష్ఠను పొందలేకపోవుచుండిరి. మతమందలి యీ సాంకర్యమును తుడిచివేయుటకై, యీ యుగమున భగవంతుడు శ్రీరామకృష్ణుడై యవతరించెను. వా రుపదేశించిన విశ్వసత్యములను ప్రపంచమంతయు వ్యాప్తి గావించిన మానవకోటికిని, ప్రపంచమునకును మంచి చేకూరగలదు. పూర్వమెన్నడును భారతదేశమున సర్వమత సముచ్చయమును బోధించిన యిట్టి మహనీయాద్భుతమూర్తి యవతరించి యుండలేదు.

ఈ సమయమున స్వామిజీ సోదరశిష్యుడొకరు "శ్రీరామకృష్ణు లవతారపురుషులని తాము పాశ్చాత్య దేశములయందేల బహిరంగముగా బోధింపలే"దని ప్రశ్నించెను.

స్వామిజీ:—వారు తమ విజ్ఞానశాస్త్రములను గూర్చియు, వేదాంత తత్త్వమునుగూర్చియు గొప్ప యార్భటమును జేయుదురు. అందుచే వారి బుద్ధిసూక్ష్మతయం దధికుల మను దురహంకారమును, తర్కము చేతను, శాస్త్రచర్చచేతను, వేదాంత జ్ఞానముచేతను భిన్నాభిన్నము జేయనిదే, మీ రేమియును అచ్చట జేయ నేరరు. ఎవ్వరు తమ విచక్షణాశక్తిచే తాము లక్ష్యమునకు చాలదూరమునం దుంటిమని గ్రహించి, సత్యాన్వేషణమునం దాసక్తిచే నన్నాశ్రయింతురో, వారికి మాత్రమే నేను శ్రీరామకృష్ణునిగూర్చి దెల్పగలను. లేనిచో నేను శ్రీరామకృష్ణు డవతారపురుషుడని బోధించుచో, వారు 'ఎందుకు? తమరు క్రొత్త విషయ మేదియును జెప్పలేదు. మాకు అన్నింటికిని ఏసుక్రీస్తు గల'డని జెప్పుదురు.

ఆ శిష్యు డీ విధముగా మూడు, నాలుగు గంట లుత్సాహముతో గడపి, యితర ప్రేక్షకులతో గలసి కలకత్తా చేరుకొనెను.



# రామకృష్ణామృతము

అనువాదకులు :

శ్రీ చల్లపల్లి అప్పారావు, బి. ఏ., బి. యల్.

## కామినీ కాంచనములు

గీ. కయ్యులొముంచు కామినీ ƒ కాంచనములు; నరుని నారాయణుని వేరుƒపరచి భువిని
తాను మునిగినదే గంగ ƒ తాను వలచి; నదియెరంభయానని పించు ƒ మది యదేమొ!

ఆ. వె. పచ్చిపోక కాయƒవలెనుండు కామినీ; కాంచనముల మనసు ƒ కైపుగొన్న,
ఎండి బెరడు కురిడి ƒ రెండు వేరయినట్లు; యతికి మేను కాత్మ ƒ కతుకులేదు.

ఆ. వె. చల్లనీరు పులుపు ƒ షర్బత్తు లిరుప్రక్క; లమరియుండ తృషితు ƒ డైనరోగి
త్రాగి జ్వరమునింక ƒ రగులజేసినరీతి; సిరుల మరులదవిలి ƒ చెడును నరుడు.

ఆ. వె. నలుసు త్రాసుముల్లు ఁ నడుమగానిల్వక; యొరిగిపోవుచుండు ఁ బరువుప్రక్క
స్త్రీల సిరులవైపు ఁ వ్రాలి మ్రొగ్గుమనంబు; దేవు నెడముచేసి ఁ తేలియాడు.

గీ. కన ప్రపంచపువిషయ రాగమ్మునొందు; కడు నజీర్ణపురోగంబుఁగల జనుండు
చింతపండూరగాయ కన్నంతనోట; జలముగారుచు పథ్యమ్ముఁ దెలియలేక.

గీ. భువిని సంసారబద్ధ జీవులు మదించి; అర్థమంగనపై మోహమాపలేరు;
దైవముఖులుగా రెంతయొ ఁ గ్గావహిలిన; గాలవుందిండి కెగబడు ఁ మీలభంగి.

గీ. నేస్తులార జాగ్రతనుండి ఁ కీడుగలుగు; వనితపై వెట్టినమ్మక ఁ మునిచిరేని,
తొండముదిరి యూసరవోలె ఁ దొరలునట్లు; బిగిసి క్రమముగ నెత్తెక్కి ఁ పిండికొట్టు.

ఆ. వె. కోతి తుట్టతుదకు ఁ కోల్పోవుప్రాణంబు; వేటగానికోల ఁ వ్రేటుచేత,
అందమైననాతి ఁ యంఘ్రులప్రాకాడి; నరుడు నాశమొందు ఁ పరము గనక.

ఆ. వె. జనుల నాత్మబోధ ఁ సఫలంబు కానేర; దేమి హేతువనిన ఁ స్వామిపలికె,
కలికివలనితగులు ఁ కలుపులుండుట పెద్ద; నెఱపులందుబుద్ధి ఁ నిలుపలేరు.

గీ. మాయయా యిది కాదు ఁ రామాయతంబు; జీవలోకంబు సర్వము ఁ చిత్రమాయ;
లింగవాచకమేగదా ఁ క్రుంగివైచె; మూలభూతమ్మునై సృష్టి ఁ జాలములను.

గీ. వచ్చి మీకడనుండ సర్వ్యంబెగాని; వీలులేనిగోడవలని ఁ విజయుడనిన,
రామకృష్ణులు పలికిరి ఁ రాణిదనర; రమణి రొక్కము కంత పాశములు మీకు.

గీ. రొట్టెకొనవచ్చు డబ్బుతో ఁ పొట్టకింతె; పరమలక్ష్యముకాదది ఁ పురుషులకును
వినుము ధనమూల మీజగత్తనెడుమాట; వట్టి దేహాత్మవాదుల ఁ వంతుపాట.

ఉ. వంతెనక్రింద నిల్వకయ ఁ పాఱెడు వారి విధంబు దోప వె
చ్చింతురు విత్తముఁ జనులు ఁ స్వేచ్ఛగలారలు కూడబెట్ట రా
వంత, అసల్ మనుష్యుడెవ ఁ డాయన లచ్చిని దాసి జేయు ధీ
మంతుడుగాక, లోభి యొక ఁ మానవుడా? యిరుగాళ్ల జంతువౌ.

ఉ. కొందరు భాగ్యవంతులని ఁ కొందరు పేరధికారులంచు వా
కొందురు డాబుగా మఱియు ఁ గొప్పవి పేరుప్రతిష్ఠలంచునుఁ
సుందరులంచు గొందరు వసుంధరపై వసియించునన్నినా
ళ్లందాక జేని బొందె వెనుకకంటి గమించునె చావుపిమ్మటన్.

చ. గరువముకూడదింత కన ఁ కంబునుగూరిచి, మేరయేడ, మి
ణ్గురుపురులొండె సంజవెలు ఁ గుల్ గద చుక్కలు రాకమున్పు, చం
దురుడు నభంబునన్ వెలయు ఁ తోడనె తారల బీరమెంత రా!
అరుణ శుభోదయంబున ఁ హిమాంశువహా! యెటులుండు సోదరా!

గీ. పరమహంసకు వేయిరూ ǂ ప్యమ్ములిచ్చి; పుచ్చుకొండను చొకభక్తు ǂ డచ్చెరువుగ
మనసు తైలంబువలెనున్న ǂ మునుగదబ్ధి; నన్న సూక్తియు మీ నోట ǂ విన్నదనిన :—

గీ. చాలసేపావ తైలము ǂ జలముపైన; నిలచియుండిన గాలెత్తి ǂ నిలువ నీదు
యెడద పడతి రొక్కములపై ǂ హెచ్చుకాల; మెడ తెగని పొందుచే ముక్కి ǂ చెడునని ముని.

గీ. యువకుడవు శిష్య యింత మా ǂ ర్పొందె మొగము; కారుమబ్బు తెరయొకటి ǂ గప్పినట్లు
తెలిసె నాఫీసు నౌకరీ ǂ తేజమిదియ; తెలివి తాకట్టుగొన్న పా ǂ ర్థివులమహిమ.

గీ. వేతనపు నౌకరింబడి ǂ వ్రేగుచుంటి; శిష్య! యిది యెంత నీచంబు ǂ సిగ్గు సిగ్గు
తల్లికోసముగాకున్న ǂ నొల్ల నిత్తు; నే పరాత్మునకొగ్గి సే ǂ వింపుమనక.

గీ. ఇంద్రియసుఖలోలత యెట్టు ǂ లెలయుననిన; చిత్సుఖానందమయునిలో ǂ చేరునపుడె;
సిద్ధులైహికసుఖముల ǂ చెంతబోరు; మట్టిబండి తో లేన? వై ǂ రమానికుండు.

క. తడికట్టియ పొయిసెగలో; పడవైచిన తడిహరించు ǂ పదినిముసములన్
విడువక దైవమె శరణని; యెడు భక్తుని విషయవృత్తి ǂ యెండినశించున్.

గీ. వేయియేడులు చెకుముకి ǂ రాయి నీట; మునిగియున్నను వెలినిప్పు ǂ కణము లిడును;
దైవకృపగల్గు మనుజుడు ǂ తారుమారు; కాడు లోన వైషయికంపు ǂ కడలి బడియు.

క. కామోద్రేకము తగ్గదె; స్వామీ మచ్చింతయైన ǂ ప్రతిదినమనుచున్;
ప్రేముడి బెంచిన శునకము; సామాన్యమె వదలిపెట్ట ǂ చాగొట్టకనే.

క. కామాదులు దుర్విషయ; భ్రామితములునై యసాధ్య ǂ వైరిగణంబౌ
రామార్పితమతులయి యవి; యే మనుజునితోడు కాని ǂ యెడలుపవశమే.

క. మనలో దౌర్బల్యము లె; ప్డు నశింపౌ ననగ పండు ǂ పువునుండి ఫలిం
చిన వెంటనె దళములు రా; లునటుల్ లో వెల్గులడర ǂ లోపములడగున్.

క. కాయజుని జయించుట యె; ట్లో యనగా, సకలసతుల ǂ నూహింపవలెన్
స్త్రీయాంబలుగ, కుబుద్ధులు; మాయంబౌ నెపుడు వారి ǂ పదములు గనినన్.

క. సత్యము ప్రత్యక్షంబయి; నిత్యము పరమేశుజూచు ǂ నిర్మలమతితా
ప్రత్యయము చెడక చెలిచే; కాత్యాయని బింబమంచు ǂ కైమోడ్పులిడున్.

చ. మునుపు కుమారు డొక్కపరి ǂ మోమున పిల్లినిరక్కె; తల్లి బు
గ్గన నొక గేరుగాంచి యడు ǂ గన్ గతమేమని పల్కెదుర్గ, నా
యన! యది నీదుగోరుకద ǂ రా! యదియెట్లన; గుర్తుతెచ్చుకొ
మ్మనియె బిడాలశాస్త్రి యుద ǂ యాన; న దేలని పుత్రుడాడినన్.

# శ్రీ వాసుదేవ మననము

## చతుర్థ వర్ణకము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

"స ఉత్తమః పురుషః । స తత్ర పర్యేతి జక్షత్క్రీడన్ రమమాణః స్త్రీభిర్వాయానైర్వాజ్ఞాతిభిర్వానోపజనం స్మరన్నిదగ్ం శరీరం॥" (ఛాం. ఉ. 8-12-3.) తత్త్వజ్ఞుడైన అతడే ఉత్తమపురుషుడు. స్వాత్మయందు స్వస్థత చేతను సర్వాత్మభూతుడైన అతడు వనితా జనముతోగాని వాహనములతోగాని పుత్ర మిత్ర బాంధవాది పరిజనముతోగాని ఆహార విహారాదులచే వినోదించువాడైనను వారి సమీపమున వర్తించు తన శరీరేంద్రియాదుల నెంతమాత్రము స్మరింపడు. తత్త్వవిజ్ఞానము చేత మిథ్యాజ్ఞానము బోధింపబడినదగుటంజేసి అవిద్యాది నిమిత్తాభావమువలన స్వపర శరీరేంద్రియాదులయందు అధ్యాసను బొందడు. అనవరత మద్వితీయాఖండైకరసాకారాకారితాంతఃకరణుడు గాన స్వానందమునే ఉపలంభించుచుండును. "వివేకః సర్వదా ముక్తః సంసార భ్రమవర్జితః॥" (యోగశిఖ. ఉ. 1-18.) సకారణ సంసారభ్రమ వివర్జితుడైన వివేకి సర్వదా ముక్తుడు. "గచ్ఛం స్తిష్ఠన్నుప విశన్ శయానో వాన్యథాపివా। యథేచ్ఛ యావసే ద్విద్వా నాత్మారామ స్సదా మునిః॥" (కుండిక. ఉ. 28.) బ్రహ్మవేత్తయగు పురుషుడు నడచుచున్నను, నిలుచున్నను, కూర్చున్నను, శయనించియున్నను. మఱి యే యవస్థయందున్నను సర్వదా మునియై సంతతమాత్మారాముడగుచు స్వతంత్రమైన స్వేచ్ఛతో వర్తించును. "విద్యాదివా ప్రకాశత్వాత్ । అవిద్యారాత్రి రుచ్యతే॥" (సన్న్యాస. ఉ. 83.) ప్రకాశత్వమువలన విద్య-జ్ఞానము-పగలుగాను. అవిద్య-అజ్ఞానము - రాత్రిగాను చెప్పబడుచున్నది. "యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ। యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥" (గీ. 2-69.) స్థితప్రజ్ఞుని కంటె వ్యతిరిక్తులైన సర్వప్రాణులకును ఏ బ్రహ్మవిద్య దుర్జ్ఞేయమగుటవలన నిశాప్రాయమైయుండునో అట్టి బ్రహ్మవిద్యయందు స్థితప్రజ్ఞుడు అనగా బ్రహ్మవిదుడు ప్రబుద్ధుడై యుండును గనుక తత్త్వజ్ఞునకు బ్రహ్మవిద్య పగటిప్రాయముగ నుండును. అజ్ఞులైన సకల ప్రాణులకు ఏ యవిద్య నిత్యసేవితమైయుండుట వలన పగటిప్రాయమై యుండునో. అట్టి యవిద్య సర్వదా సర్వత్రాత్మదర్శనుడైన బ్రహ్మవేత్తకు, విద్యచేత బాధితమగుటంజేసి అభావమువలన నిశాప్రాయమై యుండును. అనగా వివేకులకు విద్యావిద్యలు దివారాత్రిప్రాయమై యుండును. అవివేకులకు రాత్రిందివాప్రాయములై యుం

డును. అందువలన ఏ విధమున అజ్ఞులు బ్రహ్మవిద్యచేత బ్రహ్మైవాహమని పరిపూర్ణస్వస్వానందైకరసము ననుభవింప శక్తులు గారో ఆ విధముననే, సంతత స్వాత్మనిష్ఠాపరుడైన బ్రహ్మవిదుడును అవిద్యచేత 'అహం-మమ-ఇదం = నేను-నాది-ఇది-అది' యనినట్లు దేహేంద్రియాదికము ననుభవింప శక్తుడుగాడు. నిత్యము స్వాత్మారాముడయ్యె యుండును. "ఆత్మా నహి స్ఫురతి సర్వశరీరభాజాం తేషాం నిశా భవతి సా ఖలు తత్ర యోగీ। జాగర్తి జాగ్రతి చ తే వ్యవహారజాతే తన్న స్ఫురత్యురుధియః క్షణదాన్యసా తే॥" దేహాత్మజ్ఞానుల కందఱకును బ్రహ్మవిద్యావైధుర్యమువలన స్వాత్మసంవేదన మమరదు. వారికి బ్రహ్మవిద్య రాత్రిప్రాయమగుచున్నది. అట్టి స్వాత్మసంవేదనమందు బ్రహ్మవేత్త ప్రబుద్ధుడై యుండును గనుక నది వానికి జాగ్రత్ప్రాయమగుచున్నది. అజ్ఞానులు ప్రాపంచిక వ్యవహారసంలగ్నచిత్తులై యుందురు గనుక వారికి ఆత్మజ్ఞాన మంధకారప్రాయమగుచు స్ఫురించుటలేదు. ఆత్మజ్ఞానులు సంప్రాప్త బ్రహ్మవిజ్ఞానసంపన్నులై యుందురు గనుక వారికి ప్రాపంచిక వ్యవహార మంధకారప్రాయమగుచు స్ఫురించుటలేదు. "విక్షిప్యతే కదాచిద్ధీః కర్మణా భోగదాయినా। పునస్సమాహితా సాస్యాత్తదైవాభ్యాస పాటవాత్ ॥" (పంచదశి. 4-66.) అనుభవప్రదమైన - కలుగజేసెడి - ప్రారబ్ధకర్మము జరుగుచుండుటచేత, తత్త్వవిదుని చిత్తము ఒకానొకప్పుడు విక్షేపించినను - ద్వైతము ననువర్తించినను—తత్క్షణమునందే ఆ బుద్ధి బహుజన్మసమనుష్ఠిత సమాధ్యభ్యాస దార్ఢ్యమువలన మఱల సమాహితమగును - సమాధ్యవస్థను బొందినదగును. "మ॥ శివ జీవైక్య సమాధియందు విలసచ్చిన్మాత్ర తత్త్వంబు దా। నవలీలంగని పూర్ణుడై పిదప మాయాసంసృతిం జెందినం। దవులన్నేర్చునె యోగి? పాలు పెరుగై ద్రచ్చంగ వేఱైన యా। నవనీతంబిక జల్లలో గలియునో నానాప్రకారంబులన్ ॥" (సీతారామ. 3-103.) భ్రాంతి తొలగి బ్రహ్మాత్మైకత్వరూపయోగనిష్ఠయందు స్థైర్యము నొందిన జ్ఞానయోగి - చిన్మాత్రమైన అనగా జడసంపర్కములేని జ్ఞానమాత్రమైన స్వాత్మతత్త్వమును తాను సాక్షాత్తుగ దెలిసికొని సర్వపరిపూర్ణుడై యోగారూఢుండై యున్న మహాత్ముడు, మాయారచిత సంసారమును పొందినను ఈ సంసారమునకును ఆతనికిని సంబంధము కలుగునా? కలుగనేరదు. ఆతనిని సంసారవికారము లంటజాలవు. పాలను పెరుగు జేసి దానిని మథించి తీయబడిన వెన్న ఆ పాలకంటెను పెరుగుకంటెను వేఱెయగును. కాని యెన్నటికైనను ఎన్నివిధముల బ్రయత్నించినను మఱల మజ్జిగలో గలియునా? కలియదు గదా! అట్లే స్వాత్మవిజ్ఞానియు ద్వైతసంబంధమును పొందడని తెలియవలయును అను నిత్యాది శ్రుతి స్మృతిసిద్ధముగ వివేకి సర్వప్రపంచమును మిథ్యయని నిశ్చయించి ప్రారబ్ధభోగమును - అనుభవమును - కూడ స్వప్నభోగతుల్యముగనే మిథ్యామాత్రముగనే జూచును. అవివేకియైన దురాత్ముడన్ననో ప్రపంచము సత్యమనియు ఆత్మకు - తనకు - సుఖదుఃఖాద్యనుభవముకూడ సత్యమే యనియు జూచును. కనుక కర్తృత్వ భోక్తృత్వాదులయందభినివేశరహితత్వము, ఫలనిస్పృహత్వము, ఫలసాకల్యావైకల్యములయందు అనగా అనుకూల ప్రతికూలభావములయందు హర్షవిషాదశూన్యత్వమును తజ్జ్ఞుల - వివేకి అవి

వేకులయందు వైలక్షణ్యమును గ్రహించ వలెను. ఇట్లు వివేకవంతులకును శరీరపరిగ్రహ వశమున దుఃఖమే యున్నది.

శి :—స్వామీ ! 'వజ్రహస్తః' 'పురందరః' అను నిత్యాది సంజ్ఞలచేత వేదవచనముల యందు వర్ణింపబడిన దేవతలకుగూడ శరీరపరి గ్రహదర్శనమువలన దుఃఖమే యున్నదా ?

గు :—వత్సా ! దేవతలకుగూడ శరీరపరి గ్రహమువలన దుఃఖమే యున్నది. అదెట్లన, అన్యోన్యయుద్ధములవలనను, కోపశాపముల వలనను, అసుర రాక్షస విప్లవములవలనను "తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం। క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి॥" (గీ. 9-21.) స్వర్గకాములై సోమపానముచేసి స్వర్గమును జేరినవారై తమ పుణ్యవిశేషముచేత బహుళ మైన స్వర్గీయ సుఖవిశేషమును అనుభవించి తరువాత ఆ సుఖభోగమునకు కారణమైన తమ పుణ్యము క్షీణించినది యగుచుండగా మర్త్య లోకమును ప్రవేశించుచున్నారు. ఆ దేహ మును విడిచి మఱల నిహమున బుట్టుచున్నారు అనెడి న్యాయమున తమ పుణ్యకర్మఫలము నశించినదగుచుండగా భావ్యధః పాతభయము వలనను దేవతలకుగూడ దుఃఖమే గలదు.

శి :—స్వామీ ! దుఃఖవంతులైన దేవత లకు ఇతరులచేత ఉపాస్యత్వమును ఇతరులకు - ఉపాసకులకు - సుఖదాతృత్వమును ఎట్లుండును?

గు :—వత్సా ! ఈ లోకమ్ములో రాజప్రభృ తులకు స్వయందుఃఖవంతులయినను స్వాశ్రిత పరిపాలనాదికము ఉన్నరీతినే దేవతలకును అన్యోపాస్యత్వమును, అన్యులకు సుఖదాతృత్వ మును ఉండునని తెలియవలయును.

శి :—స్వామీ ! "దేవలోకే దేవా ఆనంద రూపా స్తిష్ఠంతి॥" దేవలోకమున దేవతలు ఆనందమయులై యుందురని ప్రతిపాదించెడి శ్రుతి తాత్పర్యమేమి ?

గు :—వత్సా ! వినుము. "జన్మగ్రహణేఽపి కైవల్యహేతౌ సమ్యగ్దర్శనే సతి జ్ఞానయోగ బలాన్నశోచంతి। ప్రారబ్ధసమాప్తౌ ముచ్యంత ఇత్యర్థః॥" (రత్నప్రభాఖ్యసూత్రభాష్యే.) ఆధికారికులైన అనగా అధికారరూపశరీరధారు లైన ఇంద్రాగ్ని సూర్యాది దేవతలు కైవల్య కారణమైన సమ్యగ్జ్ఞానదర్శనులయి - ఆత్మా పరోక్ష సాక్షాత్కారవంతులయి - యుండుటం జేసి, అధికారరూప శరీరధారులై యున్నను సమ్యగధిగత స్వాత్మవిజ్ఞానయోగబలమువలన సదా స్వస్వరూప పరమానందరూపమునే యుప లంభించుచుందురు కాని అంతఃకరణ ధర్మమైన దుఃఖము ననుభవింపరు. ఆత్మాపరోక్షజ్ఞాన సాక్షాత్కార సంపత్తి కారణత్వమువలన సమ్యగ్జ్ఞాన సంప్రాప్తి సమకాలమునందే సర్వ కర్మసంక్షయమగుటంజేసి అప్పుడే వారు ముక్త లగుచున్నారు కనుక ఆనందరూపులే యై యుందురని శ్రుతి తాత్పర్యము. దేవతలకు గూడ దుఃఖమున్నదని బోధించెడి "తా ఏతా దేవతాః సృష్టా అస్మిన్మహత్యర్ణవే ప్రాపతన్॥" (ఐ. ఉ. 2-1.) ఆ యీ సూర్యాది దేవతలంద ఱును సృజింపబడినవారై ఈ సంసార మహా సముద్రమునందు బడిరి. అను నీ శ్రుతివలన దేవతలకుగూడ శరీరపరిగ్రహమువలన దుఃఖమే యున్నదని తాత్పర్యము. "దేహోఽహమితి సంకల్పో మహాపాప మితి స్ఫుటమ్॥" (తేజోబిందు. ఉ. 5-96.) దేహమే నేనని శరీ రమునందు ఆత్మబుద్ధిని జేయుట మహాపాపమని స్పష్టము. "యోఽన్యథా సంతమాత్మాన మన్యథా ప్రతిపద్యతే। కింతేన నకృతం పాపం

చోరేణాత్మాపహారిణా। సా కాలసూత్రపదవీ సామహావీతివాగురా॥'' ఏ పురుషుడు, శరీర విలక్షణమై సచ్చిదానందరూపమైయున్న ఆత్మను, ఆత్మవిలక్షణమై అనృతజడదుఃఖాత్మిక దేహమునుగా గ్రహించుచున్నాఁడో అనగా దేహమే నేనని భావించునో అట్టి ఆత్మాపహారియైన చోరునిచేత ఏ పాపము చేయబడలేదు? అనగా దేహమునందు ఆత్మబుద్ధిని జేయుట వలన సమస్త పాపములు చేయబడినవే యగుచున్నవని యభిప్రాయము. ఆ దేహాత్మబుద్ధి రూప మహాపాపమే కాలసూత్రపదవి. అదియే మహావీతివాగురము అను నిత్యాదిశ్రుతులన్నియు దేహాత్మ చిత్తవృత్తియే దుఃఖమని ప్రబోధించుచున్నవి. అందువలన విదేహముక్తికొఱకే ప్రయత్నించుట కర్తవ్యము.

శి :—స్వామీ! అశరీరముక్తియే ముక్తియైన పక్షమున, సశరీరులై ఆకాశమునందు నక్షత్రరూపమున ప్రకాశించుచున్న కొందరు దేవతలు ముక్తులని లోకులచే వాకొనబడుచున్నారు. అట్టి లోకోక్తి అసత్యమా?

గు :—వత్సా! వినుము. ''సాలోక్యాది విభాగేన చతుర్ధా ముక్తిరీరితా। సహోవాచ శ్రీరామః కైవల్య ముక్తి రేకైవ పారమార్థిక రూపిణీ। దురాచారరతోవాపి మన్నామ భజనాత్కపే। సాలోక్యముక్తిమాప్నోతి నతు లోకాంతరాదికం। నిర్ధూతాశేషపాపౌఘో మత్సామీప్యం భజత్యయం। సైవసాలోక్య సామీప్య ముక్తిరిత్యభిధీయతే। సదాచారరతోభూత్వా ద్విజోనిత్య మనన్యధీః। మయి సర్వాత్మకేభావో మత్సారూప్యంభజత్యయం। సైవసాలోక్యసామీప్య సారూప్య ముక్తిరిష్యతే। గురూపదిష్టమార్గేణ ధ్యాయన్మద్రూపమవ్యయమ్। మత్సాయుజ్యంద్విజస్సమ్యగ్భజేత్ భ్రమరకీటవత్। సైవసాయుజ్యముక్తిః స్యా ద్బ్రహ్మానందకరీశివా। చతుర్విధాతుయా ముక్తిః మదుపాసనయా భవేత్॥'' (ముక్తిక. ఉ.) 1 సాలోక్యము, 2 సామీప్యము, 3 సారూప్యము, 4 సాయుజ్యమునని ముక్తి నాలుగు తరగతులుగా శాస్త్రమునందు ప్రతిపాదింపబడియున్నది. ఇందు సాయుజ్యముక్తి ఒక్కటియే పరమార్థస్వరూపమైన కైవల్యముక్తి. ప్రమాద వశమున నొకప్పుడు దురాచారసక్తుడైనను నా నామమును - శివ విష్ణ్వాది రూపమున భగవన్నామమును - సదా సేవించుచుండుట వలన నాలోకమున - శివ విష్ణ్వాదిలోకమున- నివాసమనెడి సాలోక్యముక్తిని పొందును. కాని లోకాంతరాదికమును పొందడు. ఇతడు నిత్యము నామూర్తిని సేవించుటవలన సకల దురితవ్రాత విముక్తుడగుచు నాలోకమునందు నా సామీప్యమును సేవించును. అదియే సాలోక్య సామీప్యముక్తియని పేర్కొనబడుచున్నది. విధ్యుక్తముగ విధ్యనుష్ఠానమువలన ద్విజుడైన ఇతడు (''ద్విజత్వం విధ్యనుష్ఠానాత్''=విధ్యనుష్ఠానమువలన ద్విజత్వ మమరుచున్నది' అని శ్రీ శంకరవచనము) సదాచారరతుడై సర్వాత్మకుడనైన నాయందు నిత్యమనన్య బుద్ధిగలిగి సాలోక్యసామీప్యములతో సహ నా సారూప్యమును సేవించును. అదియే సాలోక్య సామీప్య సారూప్యముక్తియనబడును. ఇట్టి ద్విజుడు అవ్యయమైన నా (ఆత్మ) రూపమును, సద్గురూపదిష్ట వేదాంతశ్రవణాది మార్గమున విచారణజేసి నైరంతర్య నిధిధ్యాసనాభ్యాస పరిపాకముచేత భ్రమరకీటన్యాయమున నా సాయుజ్యమును సత్యముగ సేవించును. అదియే సచ్చిదానందరూపత్వమువలన నిర్వికారమైన బ్రహ్మానందకరమగు సాయుజ్య

ముక్తియగును. ఈ చతుర్విధములైన ముక్తులునుగూడ నా యుపాసనచేతనే సిద్ధించును'' అని శ్రీరాముడు సామీరికి ఉపదేశించెనని ముక్తికోపనిషద్వచనము ప్రమాణముగ:— 1 సాలోక్యము, 2 సామీప్యము, 3 సారూప్యము, 4 సాయుజ్యమునని ముక్తి నాలుగు తరగతులు. వానిని బొందుటకు 1 చర్య, 2 క్రియ, 3 యోగము, 4 జ్ఞానమునని క్రమముగ నాలుగు సాధనములు చెప్పబడినవి. అందు 1 చర్యయనగా భగవత్కైంకర్య (సేవా) రూపమైన దాస్యభావము. ఇది సాలోక్యముక్తికి సాధనము. 2 క్రియయనగా షోడశోపచారములచేతను శివ విష్ణ్వాది రూపభగవత్పూజావిధానము. ఇది సామీప్యముక్తికి సాధనము. 3 యోగమనగా యమ - నియమ - త్యాగ - మౌన - దేశ - కాల - ఆసన - మూలబంధ - దేహసామ్య - దృక్స్థితి - ప్రాణాయామ - ప్రత్యాహార - ధారణ - ధ్యాన - సమాధులనెడి పంచదశాంగ విశిష్టమైన అభ్యాస రాజయోగము. ఇది సారూప్యముక్తికి సాధనము. 4 జ్ఞానమనగా "దేహేంద్రియ నిగ్రహ సద్గురూపాసన శ్రవణ మనన నిదిధ్యాసనైర్యద్యద్దృగ్దృశ్యస్వరూపం సర్వాంతరస్థం సర్వసమం ఘటపటాదిపదార్థమివావికారం వికారేషు చైతన్యం వినా కించిన్నాస్తీతి సాక్షాత్కారానుభవోజ్ఞానం॥ "ఇతి నిరాలంబోపనిషత్॥'' దృక్ దృశ్య (చేతనాచేతన) స్వరూపమును - సర్వాంతర్యామియు - సర్వత్ర సమీరసభావమును - ప్రాపంచిక షడ్భావేత్యాది వికారశూన్యమును - వికారవంతమైన జడప్రపంచమునందంతట చైతన్యమును అగు అహం ప్రత్యయ లక్ష్యార్థమైన కేవల చిన్మాత్రము వినాగా కించిత్తైన అన్యములేదని దేహేంద్రియ నిగ్రహ సద్గురూపాసన వేదాంతశ్రవణ మనన నిధిధ్యాసనాభ్యాస పరిపాక వశమున స్వయముగ సిద్ధించెడి స్వాత్మాపరోక్ష సాక్షాత్కారానుభవము జ్ఞానము - అని శ్రుతి. ఇటువంటి జ్ఞానము సాయుజ్యముక్తికి సాధనము. "సాలోక్య సామీప్య సారూపతాదిభేదస్తు సత్కర్మవిశేషసిద్ధః॥ నకర్మసిద్ధస్యతు నిత్యతేతి విచార్యకోవా విరతింకయాతి॥'' (స.వే.సి.సా. సం. 38.) సాలోక్య సామీప్య సారూప్యములనెడి త్రివిధముక్తులును సత్కర్మ విశేషము వలన పొందబడును. కర్మచితము - సంపాదితము-లగుటవలన అనిత్యములు. పునరావృత్తి సంభవమువలన ముఖ్యములుగావు. సాయుజ్యముక్తియన్ననో కర్మసాధ్యముకాదు. స్వతంత్రమగుటవలన నిత్యము. పునరావృత్త్యసంభవమువలన ముఖ్యమైన ముక్తి. "కైవల్యముక్తిరేకైవ పారమార్థికరూపిణీ॥ (ముక్తి.ఉ.) కైవల్యముక్తి - సాయుజ్యముక్తి ఒక్కటియే పరమార్థస్వరూపము'' అని శ్రుతిప్రమాణము. కావున నీ విషయమును విచారణజేసిన ఎవడు సంసారమునందు విరక్తిని పొందడు?

శి:—స్వామీ! "యోగేనసాయుజ్యం'' యోగముచేత సాయుజ్యముక్తిలభించును'' అని శాస్త్రము చెప్పుచుండగా తమరు యోగముచేత సారూప్యముక్తి ప్రాప్తించునని చెప్పెదరేమి?

గు:—వత్సా! వినుము. యోగము 1. అభ్యాసయోగమనియు, 2. జ్ఞానయోగమనియు రెండువిధములు. 1. అభ్యాసయోగమనగా.—"తీవ్రమోక్షేచ్ఛయా౽స్యతి. వైరాగ్యేణ చ తదేకపరత్వేన చిరకాలం నిత్య నిరంతరం చ క్రియమాణ విజాతీయ ప్రత్యయానంతరితాయా సజాతీయ ప్రత్యయా వృత్తిః సార్వ

కాలకీ స ఏష ఏవాభ్యాసః। తేనైవసంగతి యోగం। ఏవమభ్యాసయోగః ॥'' తీవ్రమైన మోక్షేచ్ఛచేతను అత్యర్థమైన - మితిమీరిన - వైరాగ్యముచేతను, తదేకపరత్వముతో చిరకాలము నిత్యము ఎడతెగకుండ జరుపబడునట్టి విజాతీయ ప్రత్యయ తిరస్కారపూర్వకముగ సార్వకాలిక సజాతీయ ప్రత్యయావృత్తికి అభ్యాసమని పేరు. దానితో సంగతియోగము. ఇదియే అభ్యాసయోగము. ఈ యభ్యాసయోగము—''యమోహి నియమస్త్యాగో మౌనం దేశశ్చ కాలతః। ఆసనం మూలబంధశ్చ దేహసామ్యం చ దృక్స్థితిః ॥ ప్రాణసంయమనంచైవ ప్రత్యాహారశ్చ ధారణా। ఆత్మధ్యానం సమాధిశ్చ ప్రోక్తాన్యంగానివై క్రమాత్ ॥'' (తేజోబిందు. ఉ. 1-15, 16.) 1. యమము, 2. నియమము, 3. త్యాగము, 4. మౌనము, 5. దేశము, 6. కాలము, 7. ఆసనము, 8. మూలబంధము, 9. దేహసామ్యము, 10. దృక్స్థితి, 11. ప్రాణాయామము, 12. ప్రత్యాహారము, 13. ధారణ, 14. ధ్యానము, 15. సమాధి యనెడి పంచదశాంగ విశిష్టమై యొప్పును.

1. యమ మనగా.—''సర్వం బ్రహ్మేతి వైజ్ఞానా దింద్రియగ్రామసంయమః। యమోఽయమితి సంప్రోక్తోఽభ్యసనీయో ముహుర్ముహుః ॥'' (1-17.) విశ్వమశేషము పరబ్రహ్మముయొక్క వివర్తరూపమనెడి నిశ్చయజ్ఞానమువలన, ఇంద్రియసందోహమును నిజవృత్తులనుండి నిరోధించి - మఱపించి - పరబ్రహ్మవిషయముగ ప్రవర్తింపజేయుట యమ మనబడును. ఇది మాటిమాటికి అభ్యసింపదగినది.

2. నియమ మనగా.—''సజాతీయ ప్రవాహశ్చ విజాతీయ తిరస్కృతిః। నియమోహి పరానందో నియమాత్క్రియతే బుధైః ॥'' (1-18.) విజాతీయమైన - బ్రహ్మభిన్నమగు - ఘటపటాది ప్రత్యయ తిరస్కృతియు, సజాతీయమైన - బ్రహ్మాభిన్నమగు - స్వాత్మప్రత్యయ (ప్రత్యగాత్మవిషయక) సంతతీకరణమును నియమ మనబడును. ఇట్టి నియమము వలన ప్రాజ్ఞులచేత పరమానందము అనుభవింపబడుచున్నది. ఏకజాతీయమైన ఆత్మాకారవృత్తియొక్క ప్రారంభమును, భిన్నజాతీయమైన అనాత్మాకారవృత్తినిగ్రహమును నియమ మనబడునని యర్థము.

3. త్యాగమనగా.—''త్యాగః ప్రపంచరూపస్య చిదాత్మత్వావలోకనాత్। త్యాగోహి మహతాం పూజ్యః సద్యో మోక్షమయో యతః ॥'' (1-19.) సర్వత్ర చిదాత్మత్వానుసంధానమువలన ప్రపంచముయొక్క త్యాగము సహజముగనే యగుచున్నది. విద్వజ్జనులకు పూజింపదగినట్టి త్యాగమిదియే. ఏలయన ఈ త్యాగము అనుసంధానకాలమునందే మోక్షరూపమగుచున్నది. భార్యాపుత్రగృహాదుల త్యాగము లేక శిఖాసూత్రాదుల త్యాగము గౌణముగా నున్నది.

4. మౌనమనగా.—''యస్మాద్వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ। యన్మౌనం యోగిభిర్గమ్యం తద్భజేత్సర్వదా బుధః ॥ (1-20.) వాచోయస్మాన్నివర్తంతే తద్వక్తుం కేనశక్యతే। ప్రపంచోయదివక్తవ్యః సోఽపి శబ్ద వివర్జితః ॥ (1-21.) ఇతివాతద్భవేన్మౌనం సర్వం సహజ సంజ్ఞితం। గిరాం మౌనం తు బాలానా మయుక్తం బ్రహ్మవాదినాం ॥'' (1-22.) ఏ మౌనము - బ్రహ్మజ్ఞానము - మనోవాచామగోచరమో, ఏ మౌనము బ్రహ్మవిదు

లచే నధిగమింపదగినదియో అట్టి మౌనమును బుధులు సర్వదా భజింపవలయును. అవాఙ్మానసగోచరమైన యా మౌనమును నిరూపించుట ఎవనికి సాధ్యమగును? విరివిగ జెప్పవలయుననిన అది శబ్దవివర్జితము—నామరూపరహితము. సర్వజ్ఞమైన స్వరూపజ్ఞానమే ఆ మౌనము అగును, కాని నోరుమూసికొనుట, లేక ఆఁ! ఆఁ! ఇట్లు ఉచ్చారణముచేసి వ్రేలిచేత సంకేతమును చూపుట, లేక వ్రాసిచూపుట అను నిత్యాద్యనేకవిధములైన మూఢజనులయొక్క—వాఙ్మాత్రమౌనము బ్రహ్మవాదులకు తగనిది.

5. దేశమనగా.—"ఆదావంతే చ మధ్యే చ జనో యస్మి న్నవిద్యతే। యేనేదం సతతం వ్యాప్తం సదేశో విజనస్స్మృతః॥" (1–23.) బ్రహ్మాదిస్తంబపర్యంతమైన సర్వభూతరూప ప్రపంచము రజ్జువునందు సర్పమువలె ఆది యందును మధ్యయందును అంతమునందును గూడ ఏ వస్తువునందు లేదో, ఏ వస్తువుచేత నీ సమస్త ప్రపంచము సతతము పరిపూర్ణముగ వ్యాపింపబడియున్నదో ఆ వస్తువే - నిష్ప్రపంచాత్మస్వరూపమే - విజనదేశము.

6. కాలమనగా.—"కల్పనా సర్వభూతానాం బ్రహ్మాదీనాం నిమేషతః। కాలశబ్దేన నిర్దిష్టం హ్యఖండానందమద్వయం॥" (1–24.) "ప్రత్యగ్దృష్టిర్నిమేషః" (మ. నా. ఉ. 4 అ.) నిమేషమన సుఖబోధరూప పరమాత్మయని శ్రుతి. బ్రహ్మాది పిపీలికాంత సర్వభూతముల యొక్క సృష్టిస్థితిలయములు ఏ పరబ్రహ్మము ఆధారముగా కల్పితమగుచున్నవో ఆ యద్వితీయాఖండైకరసానంద పరబ్రహ్మమే కాలశబ్దముచేత నిర్దేశింపబడుచున్నది.

(సశేషము)

---

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

శశినికేతనము.
31-7-'17.

ప్రియ దే...

నీవు వ్రాసిన యుత్తరమునుజూచి యెంతయో సంతసించితిని. నీ యింట ఉత్సవమును చక్కగా జరిపించితివని గ్రహించితిని. 'మమ పర్వానుమోదనం'. * ఇది భక్తియందలి యొకానొక అంగము. ఇచట శ్రీ·జగన్నాథ డోలోత్సవము జరుగుచున్నది. అందరును ఆనందనిమగ్నులై యున్నారు. పూరీయం దెన్నియో మఠములున్నవి. ప్రతి మఠమునందును ఈ యుత్సవము జరుపబడుచున్నది. అందరును ఆనందపరిపూర్ణులై యున్నారు. ఎంతయో మేలు. కాని భగవదానందమే ఆనందము. భగవత్సేవయం దీ భావమును మ ఱు వ క

---

* శ్లో. మజ్జన్మ కర్మ కథనం, మమ పర్వానుమోదనం,
గీత తాండవ వాదిత్రి గోష్ఠీభి మద్గృహోత్సవ. —భాగవతము ౧౧-౧౧-౩౬.

నాయొక్క జన్మము, లీలాసమ్మిశ్రితమయిన ఆలోచన జన్మాష్టమి మున్నగు పర్వదినములందు వ్రతానుష్ఠానము చేయుట, బంధుమిత్రులతో నా ఆలయమున నృత్య గీత వాద్యాదుల యనుష్ఠానము—ఇవన్నియును నన్ను బడయుటకై కావింపవలయు సాధన ప్రక్రియలు.

యున్ననే యది మంగళప్రదముగ నుండును. లేనిచో ప్రతిదియు విపరీతమగుచుండును. భగవత్సేవకు మాఱు స్వీయ సేవయే ప్రాధాన్యత వహించును. ఇదియే సేవాధర్మమునందలి అనర్థదాయకమగు పరిణామము. ఎంతయో సావధానముగ సమనస్కుడై, ప్రార్థన పరాయణుడై, వైరాగ్యముతో నున్ననే కాని దీని నుండి తప్పించుకొనజాలడు. పరిపక్వ విహీనమగు అవస్థయందు ప్రతిదియు భయంకరమయినదియే యగును. భగవద్భక్తి గాఢమయినచో నేకొదువయు నుండదు. కాని అట్టి భక్తియు స్వార్థరహితముగా నుండవలయును. నీవెట్లు పోయినను సరియే, అహంకారము, స్వార్థభావము, స్వాత్మభోగేచ్ఛ—ఇవన్నియు తొలగిననే కాని ఏ ధర్మమునందయినను సంపూర్ణానందము కలుగదు.

ప్రభువు కృపవలన భక్తున కెట్టి భయమును లేదు. ఏలనన, సరియైన భావమున్నచో ఆ భక్తుని భగవానుడే రక్షించును. ఆంతర్యము కలిగియుండుట, మనోవాక్కులు ఏకీభవించియుండుట—ఇదియే గొప్ప సాధన. ఒకేపరి దీని నవలంబింపకపోయినను పదేపదే అభ్యసించుచు దానిని చేకూర్చుకొనవలయును. మనము ప్రయత్నించిన యెడల భగవానుడు గూడ మనకు దోడ్పడును. ఆయన కృపవినా యేమియు జరుగదు. 'తేషామేవమనుకంపార్థ మహమజ్ఞానజంతమః। నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా. గీత. ౧౦-౧౧. మన జీవితమును చక్కదిద్దునదియు, మన మనుసరింపవలయునదియు నిదియొకటియే.

ఇట్లు,
నా శుభాశీర్వచనములతో,
శ్రీ తురీయానంద

శ్రీహరిశరణమ్

పూరి,
శశినికేతనము,
31-8-'17.

ప్రియ దే...

నీ యుత్తరమును జూచి నీవు క్షేమముగా నున్నావని తెలిసికొనుచున్నాను. అదియంతయు భగవంతుని విశేష కృపయే యని గ్రహింపుము. ఇట్లు ఆయన స్మరణ మననములు గావించుచుండుము. మరియు యథాశక్తిగ ఏకాంతమనస్సుతో ఆయనను ప్రార్థింపుము. భగవానుడు అంతర్యామి. మహాదయాళువు. హృదయమునందలి కోరికలన్నింటిని నెఱవేర్చును. చాంచల్యము మనోస్వభావము. భగవద్భజనమువలననే అది స్థిరపడును. ఉపాయాంతరము లేదు. భగవద్భజన చేయుచున్నచో ఆయన కృపవలన మనస్సు స్థైర్యమును బొందును. 'మైత్రీ కరుణా ముదితోపేక్షాణాం సుఖదుఃఖ పుణ్యాపుణ్య విషయాణాం భావనాథ చిత్తప్రసాదమ్-' (పాతంజలిదర్శనము, సమాధిపాదము, ౧-౩౩.) సుఖముగ నుండువారితోడి మైత్రి, దుఃఖితులయందు దయ, పుణ్యాత్ములయందు ప్రీతి, పాపాత్ములయందుపేక్ష చూపుటవలన చిత్తము స్థిరమగును అని పాతంజలియోగశాస్త్రోపదేశము. అందరియందును భగవానుడు గలడు. కావున అందరియందును ప్రేమకలిగియుండవలయును—ఇట్టి భావములవలన మనస్సు శాంతిని బొందును.

ఇట్లు,
నా ప్రేమపూర్వకాశీస్సులతో,
శ్రీ తురీయానంద

# ప్రశ్నోత్తరములు

[పాఠకలోకము నానాడు తమ సందేహనివృత్తికొఱకు మాకు బంపుచున్న ఆధ్యాత్మికప్రశ్నల కీ 'ప్రశ్నోత్తరము' లను శీర్షికయందు ఉత్తరములు ప్రచురింప నుద్యమించితిమని తెలుపుటకు సంతసించుచున్నాము.—సంపాదకులు]

## సాధక జీవనము*

ప్రశ్న : ఇది యేటి విచిత్రము! భగవానుని గాంచుటకు ఎందఱో ఎంతయో ప్రయత్నము చేయుచున్నారు. కాని వారికి భగవద్దర్శనభాగ్యము దుర్లభమగుచున్నది. అయినను కరుణామయుడన్న బిరుదమును భగవంతునకు ప్రజాలోక మనుసంధించుచునే యున్నది. ఇది ఎంతటి సమంజసము?

ఉత్తరము : నిజమే, భగవద్దర్శనార్థము ప్రయత్నించి ఆయన దర్శనము లభింపలేదని ద్వేషభావమును వహించెడివారును లేకపోలేదు. కాని తాము నిజముగా, మనస్ఫూర్తిగా, ఎంతటి ప్రయత్నము గావించినదియు వారికే తెలియును. అసలు ఆ ఆకాంక్ష తమ కెంత తీవ్రముగా నున్నదియో గమనింపవలయును. ఈ విశ్వమునందు ఐహికవిషయేచ్ఛారహితులై కేవలము భగవద్దర్శనాకాంక్షులై యుండు విరాగు లెందఱు గలరు? చాల అరుదు. ఈ విషయానుభవమే కాక, ఎన్నియో సూక్ష్మేచ్ఛలు మనలను సాధకజీవనమున ఉన్నతస్థాయి నందనీయకుండును. మన ప్రయత్నములు, ఆకాంక్ష, తీవ్రములు కాకుండుటయే భగవద్దర్శనము లభింపమికి కారణము. అంతియేకాని భగవానునకు దయలేదని చెప్పజాలము. అది యెంతయు సాహసము. ఈ సమస్తమును నేనే యైయున్నానని ఆ పరాత్పరుడు వచించియున్నపుడు మన మిట్లు ప్రశ్నింపబనియేమి?

ప్ర : కొందఱు కఠోరమయిన తపముచేసి శారీరక ఆరోగ్యమునకు భంగము గలిగించుకొనుచుందురు. అట్టివారు నిజముగా బ్రహ్మానందానుభవమును బడయుదురా? ఆ యానందానుభవమున నే శరీరస్పృహనువీడియుందురా?

ఉ : కఠోరతపము గావించి యెల్లరును ఆ యానందమును బడయుట దుస్సాధ్యము. తా మట్టి ఘోరతపోబలమున బ్రహ్మానుభవమును బడయగలమన్న దృఢవిశ్వాసముతో వారట్లు గావింతురు.

ప్ర : మనస్సు–శరీరము–పరిశుద్ధమైనదియు లేనిదియు సాధకుడు స్వయముగా గుర్తింపగలడా?

ఉ : అవును, కొంతవఱకు దెలిసికొనగలడు. మునుపటివలె మనస్సు శూన్య (బాహ్య) విష

[* ఒకానొక భక్తుడు తమ్ము ప్రశ్నించినపుడు శ్రీ శారదానందస్వాములవారొసగిన ప్రత్యుత్తరముల నిందు పొందుపఱచుచున్నాము. —సంపాదకులు]

యముల బ్రసరింపక క్రమక్రమముగా భగవదభిముఖమై యుండుటను గాంచును. అంత మాత్రమేకాక మనస్సు శాంతిని బడయును. దానికి ఆ శాంత్యనుభవము చేకూరుట గాంచును.

ప్ర: మనల ముక్తుల గావించిన భగవానున కేమి కొఱత?

ఉ: అట్లు గావించినచో ఆయనకు గలుగు వృద్ధిమాత్రమేమి?

ప్ర: భగవత్ప్రార్థనవలని ప్రయోజనమేమి? ఆయనను పిలువనిదే జీవింపజాలననియే పిలుచుచుంటినా?

ఉ: అవును.

ప్ర: కష్టము, దుఃఖము—ఇవి మనకేల కలుగుచున్నవి?

ఉ: భగవద్విశ్వాసరాహిత్యమే యిందులకు హేతువు.

ప్ర: ఎట్టి ఆధ్యాత్మికసాధనలు గావింపక పోయినను భగవద్భక్తి విశ్వాసము కల మహాత్ముల జూచుచున్నాము. అది ఎట్లు సంభవింపగలదు?

ఉ: అట్టివారు తమ పూర్వజన్మములందు సాధనలు గావించియుండవచ్చును.

ప్ర: కర్మయోగము, నిష్కామభక్తి యోగము—ఇవి రెండును ఒకటియేనా?

ఉ: నిష్కామభక్తియోగము కర్మయోగాంతర్గతము. అయినను కర్మయోగ మనునది వేఱొకటి కలదు.

ప్ర: నిష్కామభక్తియోగ మెట్టిది?

ఉ: దేవతార్చన, శాస్త్రపఠనము—మున్నగునవన్నియు భగవదుద్దేశముతో—నెట్టి యైహికచింతయు లేక—గావించుటయే నిష్కామభక్తి యని ప్రవచింపబడుచున్నది.

ప్ర: కర్మయోగ మెట్టిది?

ఉ: ఫలాఫలముల లక్షింపక కేవలము కర్తవ్యబుద్ధితో పనిచేసికొనిపోవుటయే కర్మయోగము. స్వర్గాది కామనలు సహితము కలుగరాదు.

ప్ర: శ్రీకృష్ణుడు యుద్ధము చేయుమని యర్జునునకును, తపము చేయుమని యుద్ధవునకును బోధించుటేల?

ఉ: అధికారిని గుర్తించి వారివారికి తగిన కార్యమును శ్రీకృష్ణుడు సెలవిచ్చెను.

ప్ర: నివృత్తిమార్గమే శ్రేయోదాయకమైనచో దానిలో మధ్యే మధ్యే ప్రవృత్తిమార్గము ననుసంధింపనేల?

ఉ: సాధారణ మానవుడు ప్రవృత్తిమార్గము ననుసరించియే ఆపిమ్మట మెల్ల మెల్లగా నివృత్తిమార్గమును బడయగలడు. కనుకనే యిట్టి యుపదేశము!

ప్ర: ఒకానొక వ్యక్తికి సద్విషయమున ప్రీతి కలుగకున్నను బలవంతము చేయవచ్చునా?

ఉ: బలవంతము చేయుటవలన నేమియు లాభములేదు. సంపూర్ణ స్వాధీనత నొసగుటయే మేలు. స్వాధీనమున్ననే మానవులు నివృత్తిని కోరుదురు. బలవంతముచేయుటవలన విపరీత ఫలము కలుగవచ్చును. బాహ్యమునకు మనము బలవంతము పెట్టితిమని ఆ విషయమును స్వీకరించినట్లు నటింపవచ్చును. కాని అంతరంగమున విపరీతభావనయు, ఆచరణయు కలిగియుండవచ్చును.



# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ లీలామృతము

496 పుటలు  దివ్యమగు ద్వితీయ ముద్రణము!  రూ. 5–0–0

## బ్రహ్మానంద బోధనలు

344 పుటలు  ప్రజ్జ్వలమగు ప్రథమ ముద్రణము!  రూ. 3–8–0

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

**540 పుటలు**  సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము  వెల రూ. **3–4–0**

## శ్రీ మద్భగవద్గీత

**504 పుటలు**  శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 4–0–0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

**432 పుటలు**  పండిత పామర రంజకమైన శైలి. అందమగు 6–వ కూర్పు  రూ. **3–0–0**

## శ్రీ శారదాదేవి చరిత్ర

**256 పుటలు** ఇంటింటను ఉండదగిన దివ్యగ్రంథము. ముద్దులొలుకు రెండవ కూర్పు వెల రూ. **1–12–0**

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

**186 పుటలు**  (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము)  వెల రూ. **1–4–0**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు | ... | 2 | 8 | 0 | గురూపదేశములు | ... | 0 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | ... | 2 | 4 | 0 | శ్రీ రామకృష్ణ సూక్తిరత్నములు | ... | 0 | 6 | 0 |
| రాజయోగము | ... | 2 | 4 | 0 | నా సంస్కారణ యుద్ధవిధానము | ... | 0 | 6 | 0 |
| కర్మయోగము | | 1 | 8 | 0 | నా గురుదేవుడు | ... | 0 | 6 | 0 |
| భక్తియోగము | ... | 1 | 4 | 0 | శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | 0 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | | 1 | 8 | 0 | నవీన భారతదేశము | ... | 0 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | | 1 | 8 | 0 | ముక్తిమార్గము | ... | 0 | 3 | 0 |
| అనుష్ఠాన వేదాంతము | ... | 1 | 4 | 0 | సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | 0 | 3 | 0 |
| వివేక సూర్యోదయము | ... | 1 | 0 | 0 | శ్రీ రామనామ సంకీర్తనము | ... | 0 | 1 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | | 0 | 12 | 0 | యతిగీతము (పద్యకావ్యము) | ... | 0 | 1 | 0 |
| గిరీశచంద్ర | ... | 0 | 12 | 0 | నా మతము 0 0 6 డజను | | 0 | 5 | 0 |
| భక్తిమార్గము | ... | 0 | 8 | 0 | సింహగర్జన 0 0 6 డజను | | 0 | 5 | 0 |
| చికాగో నగరోపన్యాసములు | ... | 0 | 8 | 0 | | | | | |

శ్రీ రామకృష్ణ ఆరాత్రికము 0 2 0

ఇవియేకాక సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

**వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)**

అను మాస పత్రికలును మావద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు: శ్రీ ఋతజానందస్వామి
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 15-6-53.